అటజనికాంచె భూమి సురుదంబర చుంబి శిరస్సరుజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాకలాపిజాలమున్
కటక చరత్కరేణుకర కంపితసాలము శీతశైలమున్

(మనుచరిత్ర)

కాంచన్వైష్ణవుదర్థ యోజన జటా ఘూటోత్థశాఖోప శా
ఖాంచర్ఝ్ఝాట చరన్మరుద్రయ దవీయః ప్రేషితోవ్యచ్ఛదో
దంచత్కీటకృత వ్రణచ్ఛలన లిప్యాపాదితా ధ్వన్య ని
స్పంచారాత్త మహాఫలోపమస్ఫాయద్వటక్ష్మాజమున్.

(ఆముక్త మాల్యద)

ననుభవదీయదాసుని మనంబున నెయ్యపు గిన్కబూని తా
చిన యది నాకుమన్ననయ, చెల్వగు నీపద పల్లవంబు మ
త్తనుపులకాగ్ర కంటక వితానము తాకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానవుగదా ! యికనైన నరాళకుంతలా.

(పారిజాతాపహరణము)

పంకజపాణి, శంఖ పరిభావన కంధర, తల్లియేలకో
సంకులు గట్టె నంచు కుల శైల సుతాగ్రణి పాయద్రోచి ర
త్నాంకిత హారముంప బరువానునొ బిడ్డకివేల? కర్కశా
లంకృతులంచు హల్లక కలాపములుంచు నదీలలాయయున్.

(వసుచరిత్ర)

సారథి ఛాందసుండు, వడిసాగదు చక్రయుగంబు ప్రాతపం
చారపు గుబ్బముల్, రథియు శౌర్యమునందరమానిసాత్మ వి
స్తారము ఖండ ఖండములు తానట ! మా సరియంచుతత్ పురిం
దేరులు నవ్వు శంకరుని తేరిని కేతన కింకిణీధ్వనిన్.

(పాండురంగ మాహాత్మ్యము)

# ప్రాచీన ప్రబంధం – ఆధునిక సంతకం

## (ప్రసంగ వ్యాసం)



డా॥ తాడేపల్లి పతంజలి



కీ.శే. ఆచార్య పల్లా దుర్గయ్య గారి
శతజయంతిని పురస్కరించుకొని అందిస్తున్న
డా॥ తాడేపల్లి పతంజలి గారి
ఈ ప్రసంగ వ్యాసం




ముద్రించి చిరు గ్రంథంగా అందించడానికి
సహకరించి తమ వదాన్యతను చాటుకున్న
కీ.శే. పల్లా దుర్గయ్య గారి శిష్యులు
శ్రీ ఎం. వేంకటేశ్వరరావు గారికి
**సహృదయ** కృతజ్ఞతలు తెలియజేస్తున్నది.



## డా॥ తాడేపల్లి పతంజలి



తెలుగుపద్యమ్ము గుండెలో వెలుగు నింపు
తెలుగు పద్యమ్ము చేదులో తీపినిచ్చు
తెలుగు పద్యమ్ము కలతలు తేటనిచ్చు
తెలుగు పద్యమ్ము బతుకున దీక్షనింపు

తెలుగు భాషపైనా, విశేషించి తెలుగు పద్యంపైనా గణనీయమైన అధికారాన్ని స్వయంకృషితో సాధించుకున్న డా॥ తాడేపల్లి పతంజలి గారు 'సహృదయ' మిత్రులు. ప్రాచీన పద్యంపై మక్కువ ఎంత ఉందో, ఆధునిక వచన పద్యంపై కూడా అంతే ఇష్టం పెంచుకున్న డా॥ పతంజలి గారు ప్రస్తుతం మెదక్ జిల్లా పటాన్ చెఱువు ప్రభుత్వ డిగ్రీ కళాశాల తెలుగు విభాగంలో 'రీడర్' పదవిని నిర్వహిస్తూ నిరంతర సాహిత్యాధ్యయనంతో బాటు అధ్యాపనలు కూడా కొనసాగిస్తున్నారు.

1989 నుండి బోధనారంగంలో కృషి చేస్తున్న డా॥ పతంజలి గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సెమినార్లలో సమర్పించిన పత్రాలు వీరిలోని ప్రతిభా వైవిధ్యానికి సూచికలు.

ఎంత ఎత్తుకెదిగినా ఒదిగి ఉండే మనస్తత్వం కలిగిన డా॥ పతంజలి గారు 'నేటి సమాజం' వంటి విమర్శన గ్రంథాలతో పాటు 'మామాకలాపం' అనే నాటకం 'భావనలు' అనే కవితా సంకలనం మాత్రమే గాక 'శ్రీమన్నారాయణీయా'న్ని సంస్కృతం నుండి తెలుగులోనికి అనువదించారు. తెలుగులో తొలి వాగ్గేయకారుడు అన్నమయ్య పాటలకు సరళవ్యాఖ్య చేసి 'సాక్షి' దినపత్రిక ద్వారా అందించారు పతంజలి గారు. 'అన్నమయ్య అన్నమాట', 'అన్నమయ్య గీతోపదేశాలు' అనే గ్రంథాలను కూడా రచించారు. ఇవి మాత్రమే కాక 'భవిష్యపురాణం' వంటి రచన కూడా అందిస్తూ, అంతర్జాలం ద్వారా నమక - చమకాలకు, అన్నమయ్య వేంకటేశ్వర శతకానికి వ్యాఖ్యానాన్ని సరళమైన ధోరణిలో అందిస్తున్నారు. ఆంధ్రప్రభ, స్వాతి, నవ్య మొదలైన పత్రికల ద్వారా పలు కథల్ని కూడా రచించిన డా॥ పతంజలి ఉత్తమ కథకునిగా పేరు పొందారు.

వీరి ప్రతిభను గుర్తించిన పలు సంస్థలు పలు అవార్డులను ఇచ్చి వీరిని గౌరవించారు. రాష్ట్ర ప్రభుత్వం కూడా 2010లో ఉత్తమ అధ్యాపకునిగా సత్కరించారు

ఆయనది ప్రాచీన, ఆధునిక సాహిత్యావలోఢనంలో నిరంతరం మునిగితేలే మనస్తత్వం. డా॥ పతంజలి గారు మానవ సంబంధాలు ప్రేమతత్త్వంతో ముడిపడి ఉండాలన్న గాఢ వాంఛ గలిగిన వారు.

# నివాళి ఔన్నత్యం

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య

## 1

మా గురువర్యులైన డా. పల్లా దుర్గయ్య గారు సంస్కృతాంధ్రాలలో పరిణత ప్రజ్ఞ గల విద్వాంసులు, ఉద్యమకవులు. వారి 'పాలవెల్లి' గంగిరెద్దు మొదలైన కావ్యాలు తెలుగు నాటి ప్రకృతి వైభవానికి అద్దం పట్టేవి. వారి పద్యం సంప్రదాయము, కాల్పనికత కలిసిన సజీవమైన పద్యం. తెలుగు ప్రబంధాల మీద ఇంతకు పూర్వం కొంత కృషి జరిగినా సర్వాంగ సంపూర్ణమైన గాఢమైన పరిశోధన డా. దుర్గయ్య గారిదే. ఆ రచన చూస్తే వారొక మహా ప్రబంధం నిర్మింపగల యోగ్యత ఉన్న వారని తెలియవస్తుంది. తెలంగాణంలోని అగ్రగణ్య విద్వాంసులు. గొప్ప విశ్లేషణలు అలాంటి విద్వద్వర్యుని గురించి స్మారకోపన్యాసాలు ఏర్పడటం గొప్ప నివాళి. ఆ పరంపరంలో తొలి ఉపన్యాసం ప్రబంధ వాఙ్మయ గురించిందే కావటం ఇంకా ఔన్నత్యం సంతరించుకొన్న అంశం.

## 2

**'చెప్పవలె కప్పురంబులు**
**కుప్పలుగా బోసినట్లు కుంకుమ పైపై**
**గుప్పినక్రియ, విరిపొట్లము**
**విప్పినగతి ఘుమ్మనన్ కవిత్వము సభలన్'** (వాల్మీకి చరిత్రము)

**'మసనమున గొన్న నెవ్వగలు మాన్పి, ఘటింతురు కావ్యసమ్మదం**
**బనఘ కథాముఖంబున హితాహితబోధమొనర్తు రింపుగా**
**కనుగొనుకంటె సద్భుతముగా నెటిగింతు రతీంద్రియార్థముల్**
**ఘనమతులెల్లవారికి సకారణ బంధులు గారె సత్కవుల్"**
(కవికర్ణరసాయనము)

తెలుగు ప్రబంధాల కాలం చివర కవిత్వాన్ని గురించి, నాటి కవుల కవిత్వ దృష్టి ఇది. కవిత్వము ప్రధానంగా రమణీయాంశముల సమాహారం. కప్పురముల కుప్ప. కుంకుమ (పువ్వు) గుప్పింపు, ముకుళ పుష్పవికాసము.

ఇతిహాస పురాణాలలోని కథా వస్తు విన్యాసము ఇక్కడ ప్రధానము కాదు. జీవితంలో మేల్కొనిన హఠాత్ స్వప్నము. ఇంచుమించుగా 20వ శతాబ్దంలోని కాల్పనిక కవుల కవిత్వాభ్యాసము ఈ త్రోవలోనిదే. **'ప్రణయపల్లకి పల్లకీ, ప్రసవభరవసంతపల్లికి పల్లకీ, చక్రచావ వక్రరేఖ పల్లకి'** – మొదలైన కృష్ణశాస్త్రి కవిత్వము, రఘునాథరాయలు పేర్కొన్న కప్పురములు కుప్పలు పోయుటయే. ఈ కాల్పనిక భావనకు మించిన విస్తృతి సంకుసాల నరసింహకవి పద్యంలో కనిపిస్తుంది.

సత్కవులు మనకు ఆప్తకోటి లోనివారు అకారణబంధులు, మనస్సులోని లౌకిక పరితాపాలను కావ్యరసస్ఫూర్తితో తొలగజేస్తారు. మరొక విషయం **'అనుఘకథ'**. ప్రబంధ కవులందరూ ఇంచుమించుగా పాపమును తొలగించగల పుణ్యగాథను యితివృత్తంగా గ్రహించినట్లు చెప్పినవారే. ఇందుకు ఈ ఇతివృత్తాలు పురాణేతిహాసాల నుండి గ్రహించిన ప్రసిద్ధేవృత్తాలే. ఒకవేళ కళాపూర్ణోదయం వంటి కల్పిత కథలూ దైవసాన్నిధ్యాన్ని కలిపించుకొన్నదే. ఈ కథలు ధర్మాధర్మములను కథాముఖంలో బోధించినవే.

మరొక ముఖ్యమైన అంశం – అతీంద్రియార్థములను చూచినదానికంటే విశిష్టంగా అద్భుతంగా వివరించటం, తెలుగు ప్రబంధాలలోని వర్ణనలన్నీ ఇందుకు ప్రత్యక్షోదాహరణములే. లౌకికమైన వస్తువు ఇంద్రజాలికుని చేతిలో అచ్చెరువు గొలిపేట్లుగా మారినట్లు కవిత్వేంద్రజాలం వల్ల సంభవిస్తుంది. కళాపూర్ణత్వాన్ని పొందింది. కథారంభంలోనే మర్త్యలోకకాంతల ఊయలూగింపులు స్వర్ణలోక కాంతలతో స్పర్థ వహిస్తాయి. పారిజాతాపహరణంలో మర్త్యకాంత సురలోకంలోని పారిజాతాన్ని బలవంతంగా పెరికి తెచ్చి దాని మీద స్వర్గవాసులకు అధికారమెక్కడిదని ప్రశ్నిస్తుంది. **'వినుడు సురేశ్వరు వనపాలకులు వార్ధిబొడమిన ఈ దివ్య భూరుహమునకు ఇంద్రాణి యెవ్వరు?, ఇంద్రుడెవ్వరు?'** అధికారులని ప్రశ్నిస్తుంది.

హిమాలయాలలో తప్పిపోయిన ప్రవరుడు జీవితానికి కామోపభోగం పరమార్థం కాదని, **'కామశాస్త్రోపాధ్యాయని నా వచించెదవు మేలోహోత్ర యీధర్మముల్ పాపంబుల్ రతిపుణ్యమంచు'** అని స్వర్గసుఖ భావనకంటే



ధర్మానుబంధి జీవితం ఆధిక్యాన్ని వివరిస్తారు. వసుచరిత్రలో దేవతలకు సహాయం చేసే వసురాజు కథ నదీ పర్వతాలను మానుషీకరించటంతో సార్థకమవుతుంది.

తెలుగు ప్రబంధాలలో వైవిధ్యం అనంతం. దేనికదే ఒక శిఖరం. ఒక అద్భుత నిర్మాణం. వర్ణనలు మనుష్యునికీ, ప్రకృతికీ నడుమ ఉన్న అద్భుతమైన సమన్వయాన్ని సాధించిపెట్టాయి. కథ కంటే వర్ణనలు అధికంగా ఉన్నచోట్లు వీటిలో ఉంటాయి. ఈ విశ్వగతిలో కాలగతిలో మనుష్యజీవితం ఎంత పరిమితమైందో తెలియజేస్తుంది. వీటిల్లో శృంగారవర్ణనలు అతివేలంగా ఉన్నమాట నిజమే అయినా అది ఆనాటి సమాజం అంగీకరించిన ఒక విలువగానే గ్రహించాలి.

కాళిదాస కుమారసంభవంలో ఎనిమిదవ సర్గలోని శృంగారం, తరువాతి సంస్కృతకావ్యాలలో విస్తరించింది. జయదేవుని గీతగోవిందంలోని రాధాకృష్ణ ప్రణయం శృంగారోద్దీపకమే. అనంతరం తెలుగు సాహిత్యంలో – ముఖ్యంగా 14వ శతాబ్దం నుంచి ఈ కామ భావవిస్తారవర్ణన మనం గమనించవచ్చును. తంత్రశాస్త్రంలో సాధనలో భాగంగా, శిల్పశాస్త్రంలో దేవాలయాలమీది శిల్పాలుగా ఈ కామ శృంగార వికాసం విరివిగానే వచ్చింది. ఈనాటి మన దృష్టితో నాటి సాహిత్యాన్ని నిందించటం సమంజసం కదు.

ఈ కాలంలోనే శ్రీనాథ పోతనల రచనల్లో, అన్నమయ్య శృంగార కీర్తనల్లో, క్షేత్రయ్య పదాలలో ఈ శృంగార ప్రచుర స్పందనను మనం గమనించవచ్చును. మన లలిత కళాభివ్యక్తిలోని కామభావస్ఫూర్తి అంతా నాడు సౌందర్యభావ సంకేతంగా వెలువడింది.

ప్రబంధాలన్నీ ఒక్కమాటగా తెలియజెప్పిన అంశం దాంపత్యజీవనవైభవం, ఈ సామాజిక హితచింతన గల జీవితం, సృష్టికి కేంద్రమైన పరతత్త్వంతో అనుసంధితం కావటం చాలా ప్రబంధాలు పరమార్థంగా నిరూపించాయి. మనుచరిత్రలో తపస్సు, పారిజాతాపహరణంలో భక్తి, శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో చరాచర జీవకోటిలోని దివ్యాభిముఖమైన ఆకాంక్ష పాండురంగ మాహాత్మ్యంలోని ఇహపర జీవిత సమన్వయం ఇవన్నీ కవిత్వ సాంద్రత నడుమ పొదుగబడిన రత్న సమూహం.

నిర్మాణ సౌష్ఠవంతో కూడిన ఇంతగా పరివ్యాప్తమైన ప్రబంధరచన సంస్కృత ప్రాకృతాలను విడిస్తే, మరే భారతీయ భాషలోనూ జరుగలేదనే చెప్పాలి.

సంస్కృత మహాకావ్యప్రతినిధియైన తెలుగు ప్రబంధం దృశ్య శ్రవ్య కావ్యాల సంయోజిత శిల్పమార్గాన్ని ఎన్నుకొన్నది. సంస్కృతాంధ్ర శబ్ద సామరస్యంతో అపూర్వమైన నాద సౌభాగ్యాన్ని సంతరించుకొన్నది. చంపూరూపంలో తనలోని గద్యభాగానికి కూడా కొత్త విలువలను సంపాదించింది. రగడలను ప్రవేశపెట్టి పద్యగతిలో గీతలక్షణాన్ని చేర్చి గేయసంగతిని పాఠ్యరచనారీతిలో సమావేశింపజేసింది. ఒక్కొ ప్రబంధం ఒక్క మీనాక్షీ సుందరేశ్వరుల కల్యాణశిల్పం, ఎదదలో ప్రతిధ్వనించే 'లయ' వికాసం.

అల్లసాని పెద్దన కవిత్వాన్ని గురించి చెప్పిన ఉత్పలమాలిక తెలుగు ప్రబంధానికి ఆదర్శం. పెద్దన మాలిక పూర్తిగా శృంగార రసానుభవమును తెలియజేసేదే. అది పైపై మెరుగులు కాదు. కృత్రిమ వాక్యార్థసందోహం కాదు. **'జగ్గు నిగ్గు నెనగావలె'** సౌందర్యానుభవము అతి శీఘ్రమైనదై అంటే సద్యఃపరనిర్వృతి అవిరళంగా ఉండాలి. అది **'రాతిరియుంబవల్ మరుపురాని హోయల్ చెలి యారజంపు నిద్దాతరి తీపులో యనగ తారసిలన్‌వలె'** ఈ అనుభవము పొందువేళలో చెలి కంఠంలోని అవ్యక్తధ్వని (మణితము) వలె దివారాత్రము అనుభవస్మృతికి స్థానం కావాలి. ఇలా సాగుతుంది క్రమంగా ఈ ఉత్పలమాలిక అచ్చతెనుగు భాగంలో, సంస్కృతంలోనికి వస్తు సాహిత్యము, నాటకము, మృదంగాది వాద్యఘోష, నర్తనవేళలోని నూపురస్వరము ఇవన్నీ సమాహితం కావాలి. అంతర బాహ్యజగత్తులలో ఈ అంశాలన్నీ సమన్వయం పొందిన రీతి పెద్దన చెప్పిన కవిత్వ స్వరూపం. వాచ్యం చేయటానికి అనుకూలం కాని అనుభవాన్ని స్మృతి గంధంగా వర్ణించినాడు పెద్దన.

ప్రబంధకవుల కావ్యనిర్మాణవేళలో ఈ అంశాన్ని ప్రాణభూతంగా భావించినారు. ఈ ఒదుగులోనుంచే ఆంధ్ర కావ్య ప్రపంచం వికసించింది. విస్తృతమైన మానవ జీవనాదర్శాలకు వారు దోహదం చేసి – ఈ సౌందర్యలతికకు ఇతివృత్తబలం వల్ల పురుషార్థ ఫలాలలను వెలయింపజేసినారు.

ఇంతటి శక్తివంతమైన ప్రబంధములను తిరస్కరించటం, నిరాకరించటం మనకు 20వ శతాబ్దారంభం నుంచీ ఉంది. దీనికి ప్రధాన కారణం



సంఘసంస్కరణ దృక్పథం. ఈ ఆలోచనల్లో పాశ్చాత్య జీవన వ్యవహారము, విశ్వాసాలు, సామాజిక చింతన మతదృక్పథం అంతర్భవించి ఉన్నాయి. ఇక్కడ నిరాకరించటానికి ప్రధాన కారణాలు మూసపోసినట్లున్న వస్తు విన్యాసము, అలంకారముల ప్రయోజన రహితమైన ఉపయోగం కథలో అంతర్భావం పొందని వర్ణనాదికము, యింకా అన్నింటి కంటే ముఖ్యమైన అంశం. శృంగార రసనిర్వహణం. ఈ ఆక్షేపములు కట్టమంచి రామలింగారెడ్డి కవిత్వతత్త్వ విచారముతో రూపుకట్టాయి.

కవిత్వాన్ని కావ్యాన్ని ప్రాచీనాధునిక భేదాల కారణంగా అంచనా వేయటం దోషమని కాళిదాసే స్పష్టం చేశాడు. **'పురాణ మిత్యేవనసాధుసర్వమ్ నచాపి కావ్యమ్ నవమిత్యవద్యమ్ సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే మూఢాః పరప్రత్యయనేయ బుద్ధిః'** అని కావ్య సాధుత్వ నిర్ణయానికి స్వయం పరీక్షితమైన నిర్ణయమే ముఖ్యమని, ఏ యితరుల అంచనాలకూ లొంగనక్కరలేదని స్పష్టం చేశాడు.

వేంకటనాథుడు (వేదాంతదేశికులు) **'యాదవాభ్యుదయ'** కావ్య ప్రారంభంలో ఇలా అన్నాడు.

**స కవిః కథ్యతే స్రష్టా రమతే యత్ర భారతీ**
**రసభావ గుణీభూతై రలంకారై ర్గుణోదయైః**
**తదాత్వేనూతనం సర్వ మాయత్యాంచ పురాతనమ్**
**నదోషాయై తదుభయం నగుణాయచ కల్పతే.** 1-5,6

రసభావమునకు లోబడిన అలంకారములు, గుణములు గల కవిత్వము ప్రకాశిస్తుంది. ఆ కవిని సృష్టికర్త అంటాము. కవిత్వము తత్కాలంలో వినూతనమే అయినా తరువాతి కాలంలో ప్రాతదే అవుతున్నది. కొత్త ప్రాతలనేవి కవిత్వానికి గుణాన్ని గానీ దోషాన్ని గానీ అపాదించలేవు. ఇది వేంకటనాథుని (14వ శతాబ్దం) అభిప్రాయం. ఈయన చెప్పే దానివల్ల తెలియవచ్చే అంశాలు ఇవి.

గుణములు గానీ అలంకారములు గానీ రసభావములకు అనుగుణంగా ఒదిగిపోయి వాటి ప్రకృష్టమైన ఆవిష్కారానికి దోహదం కావాలి. స్వతంత్రంగా వాటికి వేరే ఉనికి లేదు. రసభావములకు సిద్ధింపజేయుటలో సమర్థం కాని,

గుణాలంకారములు వ్యర్థములు అనుచితం, గొప్పకవి ఎవరైనా సరే వాటిని ఉచితంగానే ప్రయోగిస్తాడు.

కవిత్వం దేశకాల పరిమితులలో ప్రాదుర్భావం చెందినా తరువాత అది ఆరెంటికీ అతీతంగా ఎదిగిపోతుంది. ఒక కవి యొక్క జన్మ విద్యాది అర్హతలుగానీ, ఒకానొక ప్రత్యేక దేశంలో పుట్టి ఉండటం వంటి అంశాలు కానీ, ఒకానొక కాలము గానీ దానికి ప్రత్యేక విశిష్టతలను నిలబెట్టలేవు. దేశకాల వైయక్తికవస్తు పరిమితులేవైనా గ్రంథం కాలాంతరంలో పొరలు పొరలు జారినట్లుగా విడిపోయి క్రమంగా ఆ మహాగ్రంథం (క్లాసిక్) ఏదైనా సార్వకాలీన విశ్వజనీనమైన మానవానుభవ స్థానంగా మిగిలిపోతుంది.

కాళిదాసు, వేంకటనాథులు చెప్పిన అభిప్రాయాలను గమనిస్తే భారతీయ సాహిత్యయుగాలలోని ఆదిమయుగంలో, మధ్య యుగాలలో కవిత్వాన్ని గురించి ఉన్న అభిప్రాయాలు స్పష్టంగానే తెలియవస్తవి.

సామాన్య జీవనంలోని అంశం సాహిత్యంగా పరివర్తన చెందేప్పుడు విశిష్టమైన పరిణామం జరుగుతుంది. గొంగళిపురుగు సీతాకోకచిలుకగా మారుతుంది. చివురుల గుబురుల్లోంచి పరిమళ భరితమైన పుష్పం వస్తుంది. అట్లాగే జీవితంలో నుంచి సాహిత్యం వస్తుంది. అయితే ఇక్కడ కార్యకారణభావం ఆరెంటి మధ్యన అభేదాన్ని అంగీకరించటం లేదు. సాహిత్యం జీవితంలో నుండి ఉద్గమించినా జీవితం కంటే విలక్షణమైంది. జీవితంలోని అవస్థాభేదాలు, జరామరణాది పరిమితులు కావ్య విధానాలకు ఉండవు. ఈ పాత్రలు వాస్తవానికి కట్టుబడక స్వభావ జగత్తులో నుంచి విధాన జగత్తులోనికి ప్రయాణం చేస్తాయి.

ఈ ప్రక్రియ సాధారణీకరణం ద్వారా జరుగుతుంది. ఈ పరివర్తన క్రమంలో దేహేంద్రియాలు తొలగి భావలోకం సృష్టింపబడుతుంది. వ్యక్తి ప్రతీక అవుతాడు. అనుభవం వైశ్వికమవుతుంది.

సాహిత్యం వాస్తవ జగత్తునకు పరివర్తిత రూపంగా కాక ప్రతిఫలితమైన రూపంగా భావించటం వలన ఆ ఇబ్బంది వస్తున్నది. వాస్తవికత, సామ్యవాద వాస్తవికత ఇత్యాది సిద్ధాంతాలు ఈ పద్ధతిలోనే వచ్చాయి. లోకజీవనం శబ్ద జగత్తులోకి పరివర్తన పొందే దశలో ప్రతిఫలనం తొలిదశ అని కూడా కచ్చితంగా



చెప్పలేము. దేశకాలాలను కట్టిపడేసే సంకెళ్ళవంటి అంశాలు కావ్యేతివృత్తానికి రెక్కలు తొడగనీయకుండా అడ్డుకోవడం జరుగుతుంది. అప్పుడు ఆ దేశకాలలలో నిలచి అక్కడి నుంచి వాటితోపాటే నిష్క్రమించటం ఆ ఇతివృత్తానికి పట్టే దుర్దశ. కవి ప్రతిభ పరుసవేదియై జీవన వస్తువును రసజగత్తులోనికి పరిణమింప జేయగలదు. ప్రతిభా రహితమైన కావ్యాలాపము – చరిత్ర, రిపోర్టు, నివేదిక కాకపోతే మరోటి అవుతుంది.

ఈ విషయం ప్రతి కవికీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తెలిసే ఉంటుంది. శ్రీశ్రీ కవిత్వాన్ని గురించి ఒక గొప్ప గీతాన్ని వ్రాశాడు. **'కవితా ఓ కవితా'** అని. దానిలో కవిత్వాన్ని గురించి – క్షణికమై శాశ్వతమైన బ్రహ్మానందానుభవం అన్నాడు. క్షణికమై అన్నప్పుడు దేశకాల పరిమితులలో నుండి ఉద్గమించటం గురించి, దాని ప్రాథమిక ఉపరితలాంశాల గురించిన నివేదన ఉన్నది. శాశ్వతమై అన్నప్పుడు తాత్కాలికాలైన తత్తద్దేశానికి చెందిన పరిమితులకు అతీతంగా ఎదగేలక్షణాన్ని స్పష్టం చేసి, అది ఎలా విశ్వజనీన లక్షణాన్ని కలిగి ఉంటుందో తెలియజేస్తాడు. ఈ రెండు విరోధాంశాలను, అంతస్సులోని దైవికాంశాలనూ స్పష్టీకరించటం జరుగుతున్నది. ఈ రచన **'తదేజతి తన్నైజతి తద్దూరే తద్వదంతికే'** అన్న ఉపనిషద్వివరణను పోలి ఉన్నది.

ఏ కాలంలోనైనా సాహిత్యంలో ఎగుడుదిగుడులూ, ఉత్తమ మధ్యమ రచనలూ ఉంటాయి. ఒక ప్రక్రియా సాహిత్యాన్ని లేదా ఒక కాలంలోని సాహిత్యాన్ని పరీక్షించేప్పుడు ప్రధానమైన అంశం – దానికి ప్రాతినిధ్యం వహించే రచనలను స్వీకరించి చర్చించటం, ఆ ప్రక్రియా వికాసంలోని ఉత్థాన పతనాలు, గమనించటం ఆ విధంగా మనం అంచనా వేయవచ్చును.

ఒక పరిశీలనకు ఆధారంగా మనం మనుచరిత్ర, ఆముక్తమాల్యద, వసుచరిత్ర, పాండురంగ మాహాత్మ్యము, కళాపూర్ణోదయములను గ్రహించవచ్చును. ప్రబంధం అని మనం అంటున్న మహాకావ్య ప్రక్రియకు ఈ రచనలు ప్రాతినిధ్యం వహించేవే. ఈ కావ్యాలన్నీ దేనికవే విశిష్టమైన లక్షణాలు కలవి. మనుచరిత్ర మార్కండేయ పురాణాంతర్గతమైన గాథ, ఆముక్తమాల్యద ద్రావిడ దేశంలోని భక్తుల గాథా సంపుటి, వసుచరిత్ర మహాభారతంలో ప్రస్తావితమైన లఘువృత్తాంతం. పాండురంగ మాహాత్మ్యము క్షేత్రమహిమ

ప్రతిపాదకం. కళాపూర్ణోదయం పౌరాణిక భిత్తిక మీద చిత్రితమైన కల్పనాకథ. వస్తు విన్యాసంలోగానీ, వస్తు నిర్వహణంలోగానీ, దేనికదే స్వతంత్రమైంది. ఒకదానితో మరొకదానికి పోలికయే లేదు.

ఆంధ్ర మహాకావ్య స్వరూప వివేచనలో ప్రధానమైన ప్రబంధాలను పరికించినప్పుడు వీటిల్లోని ఇతివృత్తములలో సామ్యము మాసిపోయిన విధము ఉన్నట్లుగా చెప్పలేము. ఆనాటి కవులందరూ తమతమ ప్రతిభకు అనుగుణంగా కావ్యములోని కథా సందర్భాన్ని తీర్చిదిద్దుకుంటూ ప్రత్యేకమైన వైవిధ్యాన్ని నిరూపించారనే తెలుస్తుంది. అష్టాదశ వర్ణనల తీర్పులోనూ ఎవరి మార్గం వారిది. కావ్యం నిండా పరచుకున్న ఋతువర్ణనల్లో ఆముక్తమాల్యద కల్పనాశక్తి యొక్క అవధులను ముట్టింది.

సమాజానికీ మూలమైన గృహస్థజీవనము, స్త్రీ పురుష సంబంధాలు, ఏకపత్నీ వ్రతము మొదలైన అంశాలకు కిరీటం పెట్టిన మానవ జీవన పరమార్థాన్ని వ్యాఖ్యానించిన మనుచరిత్ర వైశిష్ట్యం వేరు. క్షేత్రమాహాత్మ్యమైనా – పాండురంగని కావ్యం కూడా దానినే ప్రకటించింది. అయుత నియుతోపాఖ్యానమైనా, నిగమశర్మ కథయైనా, పుండరీకుని తపస్సైనా అంతటా విశ్లేషించబడింది. మానవ జీవనం యొక్క ఆచరణ లక్ష్యమే. కావ్యగతంగా దైవము, దైవగాథలూ అన్నీ మనుష్యుల అనుభవ పరిధిలోనికి వచ్చేవే. ఇక్కడ మత తత్త్వశాస్త్రాలకు ప్రాధాన్యం లేదు. ప్రాతిభాషికంగా ఒక కావ్యం దేవతా సంబంధిగానో, రాజసంబంధిగానో కానరావచ్చు. అంత మాత్రాన ఆ కావ్యం దేవతల తత్త్వాన్నీ రాజుల వైభవాన్నీ చెప్పదు. మానవుల సుఖదుఃఖాలనూ, ఆశలనూ, వైఫల్యాలనూ ఉత్థాన పతనాలనూ చిత్రించుతుంది. దేవతలు కూడా మానవులవలె ప్రవర్తిస్తారు. ఆ మనః పరిమితులలోనే వ్యక్తమవుతారు. అందువల్లనే ఆ కథాంశాలు మనకు సాధర్మ్య భావాన్ని కలిగిస్తవి. దేవతామయమైనది ప్రకృతి. మానవజీవనం ప్రకృతిలో సామరస్యాన్ని సాధించేది. సామాజికదశలో త్యాగం పరిణతిని చేరుస్తుంది. దానం అనేది స్వస్థితిని క్రమంగా సమాజస్థితిలో లీనం చేసే అంశం.

కళాపూర్ణోదయంలో మనుష్య జీవితంలో ప్రవృత్తులలో దేవ మనుష్య భేదం లేకుండా పేరుకొని ఉన్న ఆశలూ, అసూయలూ – పట్టుదలలూ– ఉడుకుబోతుతనమై ఇవన్నీ ప్రకటంగా వ్యక్తమవుతవి. వైకుంఠంలో శ్రీ మహాలక్ష్మి



కొలువునకు రాబోతున్నప్పుడు జనుల ఒత్తిడికి తట్టుకోటానికి వేత్రహస్తులు కొట్టిన దెబ్బలు బ్రహ్మాదులకే తప్పలేదట. ఇక్కడ సన్నివేశం అతి ప్రధానమైన ఎవరైనా వ్యక్తియో వచ్చినపుడు లోకంలో ఇప్పుడు కానవచ్చే దృశ్యమే.

మనుచరిత్ర మరొక విలక్షణ కావ్యం. ఒకే రాతిలో తొలిచి నిర్మించిన ఎల్లోరాలోని కైలాసనాథ దేవాలయం వంటి సృష్టి. ప్రతి సూక్ష్మాంశమూ నిర్దుష్టంగా తీర్చిన కళాఖండం. స్థావర జంగముల నడమగల సామరస్యం దీనిలోని ఇతివృత్తం. ప్రకృతి అంతా మానుషస్థితిని అవలంబించి కావ్యంలో ప్రవర్తించింది. ప్రకృతిలో నుంచి ఎదిగిన యింద్రాదులూ దీనిలో పాత్రలే అయినారు. స్థావర జంగమ మనుష్య దేవతల నడుమ సాగిన ఈ కథను మూడుపొరలుగా, అంతస్థులుగా తీర్చిదిద్దిన కవి – ఆ అభివ్యక్తి కోసం మూడు అంతస్థులను వ్యక్తం చేయగల ప్రత్యేక రచనాశైలిని ఎన్నుకోవడం జరిగింది. అందువల్ల వసుచరిత్రలోని శబ్దం కుబుసం విడువని పాము.

ఇంతటి వైవిధ్యం కానవస్తుండగా ఇవన్నీ మూసలో పోసిన బొమ్మలవంటి రచనలే నన్న విమర్శ వాస్తవదూరమైంది.

దృశ్య, శ్రవ్య కావ్యాలలో ఇతివృత్త నిర్వహణలో భేదమున్నది. దృశ్యకావ్యంలో పంచ సంధులు కథాగతికి క్రమోన్నీలనాన్ని నిర్ధారిస్తవి. శ్రవ్యకావ్యంలో ఇతివృత్తోన్మీలనంలో కవికి అధికస్వేచ్ఛ ఉన్నది. శ్రోత అభిలాషను పురస్కరించుకొని శ్రవ్య కావ్యంలో వర్ణనాధికము. చమత్కార కారకమైన అలంకారాధికము విస్తరించవచ్చును. ఈ లక్షణం పాల్కురికి సోమన బసవపురాణము పండితారాధ్య చరిత్రలలో కానవస్తుంది. ఇతిహాస పురాణాదులలో లేని ఈవెసులబాటు మహాకావ్యంలో కవికి ఉన్నది. కొన్ని పరిమితులకు లోబడి ఈ శ్రవ్యకావ్యాలకు మూలాలైన వీరగాథలు మొదలైన వాటిల్లో విస్తరించిన వర్ణనాధికమును అలంకారాంశములను మనం చూడవచ్చును. ఆ మూలం నుండి ఎదిగిరావటం వలన ఈ రచన కూడా ఆ లక్షణాలను పూర్తిగా వదిలించుకోలేదు. అందుకే దీనికి విస్తరకవిత అన్న పేరు కూడా ఉన్నది. సంస్కృతభాషలోని పంచ కావ్యాలలోనూ ఈ లక్షణం విస్తారంగానే కానవస్తుంది.

అష్టాదశ వర్ణనలు – వాటిని పేర్కొనటంలో ఎన్ని భేదాలున్నా – సమాజం యొక్క స్థూలరూపాన్ని అందించటానికి అవి ఉద్దేశింపబడ్డాయి. కథ ప్రవర్తించే దేశకాలాలు – సన్నివేశాలు దీనిలో అంశాలు, వర్ణనలవల్ల వైయక్తికంగా స్ఫురించే ఇతివృత్తం సమాజరూపంలోకి విస్తరిస్తున్నదని తాత్పర్యం. మరి వర్ణనలలో ప్రధానాంశం జాగ్రత్తగా గమనించితే ఆయా వర్ణ్య విషయాల మీద మానవత్వారోపణం చేసి మానుష చరిత్రను, స్వభావాన్ని వ్యాఖ్యానించటం జరుగుతుంది. ఇది గమనించితే వర్ణనలు ప్రధానేతివృత్తానికి అనుబంధంగా కవి లోకానుభవాన్ని పరిశీలనను విశదీకరించే సందర్భం.

**'ఔచిత్య విచారచర్చ'** కర్త దృష్టిలో కాళిదాసుకు కూడా ఈ అనౌచిత్యాలు తప్పలేదు. కథాగతములైన రసభావమునకు ఉత్కర్ష కలిగించలేని సన్నివేశంలో వర్ణనలు అవసరం అనటంలో సందేహం లేదు. అయితే చాలా సన్నివేశాలలో వర్ణనలు కథా ప్రవృత్తిలోని అనభివ్యక్తమైన మానసిక స్థితిని వ్యక్తం చేయటానికి ఉద్విగ్నతను తొలగించటానికి ఉద్దేశింపబడినట్లుగా పరిశీలించితే తెలియవస్తుంది.

## 3

ఇక శృంగార విషయం.

ప్రధానమైనదీ అత్యంతము వివాదాస్పదమైనదీ అంశము. ఈ ప్రపంచము **'చేసిన సంసారమే చేయుచున్నది తనదైన అనుభూతి తనదిగాన'**. ఈ విషయంలో సార్వజనీనమైన అంశం ఎంత ఉన్నదో నిజమైన అంశమూ అంతే ఉన్నది. భారతదేశంలోని రెండు జీవన విధానాలు పరస్పరం సంఘర్షిస్తూ, సమన్వయం కోసం ప్రయత్నిస్తూ కొనసాగినవేమోనని తోస్తున్నది. నూరేండ్లు సుఖంగా ఆనందంగా జీవిద్దాము అన్న విచారణ కూడా ఆది నుండీ కొనసాగుతూ వచ్చింది. స్త్రీపురుష సంయోగములను పవిత్రయజ్ఞంగా ఛాందోగ్యం పేర్కొన్నది. ఈ ప్రసక్తి పంచాగ్ని విద్యా ప్రకరణంలోనూ సూచితమవుతున్నది.

పురుషార్థ చక్రంలోని కామానికి సగపాలు. అర్థానికి సగం. అర్థకామాలు రెండూ ఐహికాన్ని పరిపాలించే అంశాలు. ఈ అర్థకామాలను ధర్మం నియంత్రిస్తున్నది. **'ధర్మా విరుద్ధఃకామోస్మి భూతేషు భరతర్షభ'** అన్న గీతా వాక్యం అర్థకామాల పరిమితిని వెల్లడి చేస్తున్నది. దీనిలో ఈశ్వరుడు కూడా ధర్మమునకు అవిరుద్ధంగా ఉన్న కామం కూడా తానే అంటున్నాడు. కామసూత్రం శాస్త్ర స్థాయికి చెందింది.



కామానుభవం నాగరికమైనప్పుడు శృంగారమవుతున్నది. ధర్మపు హద్దులు దాటినప్పుడు కామము అవుతున్నది. శృంగారానుభవం – కామము – సౌందర్యము సంయోగము పొందినప్పుడు కలుగుతున్నది. అయితే అనుభవం మౌలికంగా ఎక్కడున్నా ఒక్కటే. ప్రాణకోశ పరిమితిలో కామమయితే అనుభవం మౌలికంగా ఎక్కడున్నా ఒక్కటే. ప్రాణకోశ పరిమితిలో కామమయితే మనఃకోశ పరిమితిలో శృంగారమవుతున్నది. రెంటి నడిమి వంతెన సౌందర్యం. కామము – సౌందర్యము – శృంగారము. ఇది లోకములోని అనుభవ జగత్తులో అత్యంత ప్రధానమవుతున్నది. దానికి ప్రధాన కారణం, అది లోకస్థితికి అనుస్యూతికీ ప్రధాన హేతువు కనుక.

భారతీయ సాహిత్యంలో శృంగార రసమునకు అత్యంత ప్రాధాన్యమున్నది. దాన్ని రసరాజుగా పేర్కొనటం జరిగింది. **'శృంగార ఏవమధురః'** అని రసమాధుర్యాన్ని లోకం ప్రశంసించింది. మన సాహిత్యంలో అంగాంగ వర్ణనలు. సంయోగ శృంగార ప్రకటనమును గూర్చిందే ప్రధానంగా చర్చ. కామోద్దీపకాలైన కుచకచాదుల వర్ణనము, నఖశిఖ పర్యంతము శరీరాన్ని వర్ణించటం, నాయికానాయకుల కలయిక సందర్భంలో సంభోగాన్ని వర్ణించటం కావ్య సాహిత్యంలో వైషధం నాటి నుంచే ఉన్నదని చెప్పాలి. అంతకు పూర్వం కుమార సంభవంలో అష్టమసర్గ పార్వతీ పరమేశ్వరుల సంయోగాన్ని వర్ణించింది. ఇతిహాసాలలో లేని ఏ స్వచ్ఛందత కావ్యాలలో ఎందుకు ప్రవేశించింది? గీత గోవిందాదులు తరువాతి కావ్య ప్రపంచం మొత్తం ఈ లక్షణాలు కలిగి ఉన్నది.

కావ్య సాహిత్యంలోని ఈ వర్ణనలు చదవగల కొద్ది మందికే పరిమితమైనవని అనుకోవాలా? లేదా సార్వజనీనాలా? మానవ జీవితంలోని నీతికి అత్యంత ప్రాధాన్యమిచ్చే భారతీయ జీవన వ్యవస్థ అశ్లీలపు సరిహద్దులదాకా సాహిత్యాన్ని ఎందుకు ప్రయాణింపనిచ్చింది? ఈ ప్రశ్నకు సమాధానం కోసం శిల్ప చిత్రకళలను పరిశీలించాలి. శిల్పములలో ఆగమములు ప్రమాణాలు నిర్దేశించటంలో శరీర విగ్రహా నిర్మాణంలో అంగాంగములన్నీ సుందరముగా తీర్చబడ్డవి. హైందవ బౌద్ధ శిల్పాలు రెంటిలోనూ ఈ లక్షణం స్పష్టంగానే ఉంది. మైథున శిల్పాలు క్రమంగా ఖజురహో, కోణార్క వంటి దేవాలయాలలో ప్రాచుర్యం పొందాయి. అజంతా చిత్రాలలోనూ స్త్రీల స్తనమండలాలు

వల్కలాదులచేత అచ్ఛాదితాలు. రవివర్మ చిత్రాలు రచించే మేరకు దేశీ శిల్పాలలో కూడా జఘన వక్షోజాలు విస్ఫుటంగానే శిల్పీకరించబడ్డాయి.

చిత్రముగానీ, శిల్పముగానీ సృష్టిలోని అంతరికమైన చైతన్యక్రమాన్ని వెల్లడి చేస్తున్నది. షడంగములు నిరూపించుకొని శిల్ప చిత్ర నిర్మాణం చేస్తూ ఉన్నాడు కళాకారుడు. 1. రూపభేదము (నానా ప్రకారమైన సృష్టిలో ఉన్న రూపాల నడుమ వైవిధ్యము) 2. ప్రమాణము (అంగనిష్పత్తి, రేఖానిశ్చయం, సామరస్యము, దృక్పథము). 3. భావము (రూపమువల్ల ఉద్వేగాలు లేదా సౌందర్యము యొక్క అభివ్యక్తి) 4. లావణ్యము (సౌందర్యదృష్టికి తృప్తి కలిగించే ఆకర్షణ సౌందర్యం కోసం చేసే అన్వేషణ), 5. సాదృశ్యము (రూపము ధ్వని స్ఫురింపజేసే సత్యము) 6. వర్ణికా భంగము (రంగుల మార్పులు కదలికలతో సమన్వితమైన కలయిక) ఇవి ఆ షడంగాలు, వీటిలో ఒకటి రెండు లక్షణాలు చిత్రకళకు సంబంధించినవే అయినా మిగిలినవి శిల్పానికీ, సాహిత్యానికీ కూడా అన్వయమవుతాయి.

ఒక విధంగా సాహిత్యంగా ప్రత్యక్షమయ్యే అంగాంగ వర్ణన శిల్పకళలవల్ల కలిగే రూప సాక్షాత్కారానుభవాన్ని శబ్దం ద్వారా కలిగింపజేసే యత్నం అని అనిపిస్తుంది. ఒక క్రమంలో పాదాది కేశాంతంగానీ, కేశాదిపాదాంతంగానీ నెమ్మది నెమ్మదిగా భావన చేస్తూ మనస్సులోనికి తెచ్చుకోవటం కోసం సహృదయుడు చేసే ప్రయత్నంగా తోస్తుంది. సౌందర్యమును మనస్సులోనికి ప్రవేశింపజేసే ప్రయత్నంలో భాగంగా ఉత్ప్రేక్షాదులను ఉపయోగించి అసాధ్యాన్ని సుసాధ్యం చేస్తున్నాడు కవి. సాధారణంగా ఇక్కడ అరూపబింబాలకంటే (Abstract images) స్పష్టమైన బింబాలనే (Concrete images) ఉపయోగించటం జరుగుతుంది. ఉత్ప్రేక్షలు ఇక్కడ ప్రాధాన్యం వహిస్తున్నవి. సౌందర్యం నుండి శృంగారానికీ, అక్కడి నుండి కామానికీ ప్రయాణం చేసే దిశలో ఈ అంగాంగ వర్ణన ఒక మెట్టు వంటిది.

కానీ శిల్పాలలోని కామ భంగిమలను, కావ్యాలలో సంభోగ వర్ణనలను అర్థం చేసుకోవటం ఎలా ఇది మరొక ప్రశ్న.

దీనికి సమాధానం మూడు పద్ధతులలో గ్రహించటానికి వీలున్నది.

1. ఆదిమ కాలంలో తంత్ర సంప్రదాయలలోని స్త్రీపుంసంయోగములను, భైరవీ భైరవ సంయోగంగా భావించటం, ఆ సన్నివేశంలో పొందిన



చిత్తోన్మత్తవృత్తిని కేవలత్వంగా నిశ్చయించటం జరిగింది. పంచ 'మ' కారాలు భౌతిక ప్రాణిక దశలలోని సుఖానుభవాల ద్వారానే పరమార్థాన్ని అందుకునే నిచ్చెనలుగా భావించటం, భౌతిక జగత్తులోనే ఈ సుఖాలను బీజాలుగా నాటి పరమార్థానికి అభిముఖంగా ఫలాలను పొందటం.

2. సౌందర్యానుభవమే ప్రధానమని అదియే పరమార్థమని దాన్ని సాధించటం కోసమే జీవితమనే వాదం. ఈ వాదాన్ని మనుచరిత్రలో వరూధిని ప్రతిపాదించింది. **'ఎందేడెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్‌బొందున్, కుంభగత ప్రదీపకళికా శ్రీ దోపనెందుందు బోకెందే నింద్రియముల్ సుఖంబుగమనునాయింపే పరబ్రహ్మంబు'** గను ఇది యింద్రియ సుఖవాదధోరణి.

ఈ జగత్తు మొత్తం ఈశ్వరుని లీలావిభూతి అని, జీవులందరూ అతనికి లీలోపకరణాలని నిరూపించి – ఈశ్వరునికి శేషభూతమైన సృష్టి, జీవకోటి అతనికి భోగయోగ్యమైనదిగా భావించటం ఈ క్రమంలోనే ఈశ్వరుడు పురుషుడనీ, జీవులందరూ అతన్ని అభిసరించే స్త్రీ కోటి అనే భాగవత సంప్రదాయం వెలుగులోకి వచ్చింది.

అందువల్ల శృంగార భంగిమల శిల్పాలు, కావ్యాలలో వర్ణితమైన సంయోగ శృంగారానికి జీవేశ్వర సంయోగంగా ప్రతీకార్థం నిర్మించిన భాగవత సంప్రదాయంగానీ, తాంత్రిక సంప్రదాయంగానీ ప్రధాన కారణాలు కావచ్చును. రెండవదియైన సౌందర్యానుభవసూత్రం భారతీయ జీవనతత్త్వ పరిధిలో ఇముడదు కనుక ఇది బలమైన కారణం కాకపోవచ్చును.

భాగవత సంప్రదాయం రాసక్రీడగా ప్రకటమైంది. భక్తి సంప్రదాయాలలో శ్రీ శఠగోపుల రచనలో నాయికా భావనము ఉన్నది. అయితే ఈశ్వరునికే చెందవలసిన ఈ భావం మేరలు దాటి సామాన్య మానవ జీవనంలోని సామాన్య జనుల సంబంధాలలో సంయోగ శృంగార వర్ణనగా వ్యక్తం కావడం యింకా వీడని ముడియే ఇంకా ఇది చర్చింపదగిన అంశమే.

దీన్ని వేరొక దృష్టికోణం నుంచి కూడా చూడవచ్చును. 19వ శతాబ్దంలో పాశ్చాత్య సంపర్కంలో మనకు మన కావ్యాలలోని శృంగార వర్ణనము చాలా వరకు అసభ్యముగా కానవచ్చింది. క్రైస్తవ గాథల ననుసరించి ఆదిమానవుడు

నిషిద్ధ ఫలానుభవం వల్ల కామానికి లొంగి పోయినాడు. ఈ కామానుభవం సృష్టికి కారణమైంది. ఇదే మానవుడు చేసిన మౌలికమైన పాపం. ఈ దృష్టితో చూచినప్పుడు మన సంఘ సంస్కర్తలకు ప్రాచీన కావ్యాలలోని శృంగార వర్ణనలు అసభ్యంగా అనుచితముగా కానరావటంలో ఆశ్చర్యం లేదు. ప్యూరిటనిస్టు ధోరణి వల్ల ఈ నిరాకరణ ప్రారంభమైంది. కొన్ని శృంగార గ్రంథాలను నిషేధించే ప్రయత్నం ఈ శతాబ్దారంభంలో జరగటం కూడా ఈ అంశానికి పొడిగింపే. వీరేశలింగం, గురజాడ రచనల్లో కానవచ్చే ఈ విరోధం రామలింగారెడ్డి రచన నాటికి విజృంభించింది.

పాశ్చాత్య సంస్కారం వల్ల ప్రభావితమైన ఆలోచనా ధోరణి ప్రబంధాలను నిరసించడానికి ప్రాధాన్యం వహించిందనే కారణం వల్ల నిజమేనని అంగీకరించవలసి ఉన్నది.

ప్రబంధాలలో అపారమైన మధురశబ్ద సంయోజనమున్నది. పద్య రచనాప్రాగల్భ్యమున్నది. తెలుగు భాషకు సహజమైన సంగీతలయాత్మకత ఉన్నది. అపారమైన ప్రకృతి వర్ణనమున్నది జీవితాన్ని గురించిన త్యాగమయ భోగమయ దృష్టులకు నడుమ ఒక సంఘర్షణమున్నది. భక్తి ప్రచారం ముఖ్యమై కావ్యాలనిండా పరచుకొని ఉన్నది.

ఈ ప్రబంధాల సమష్టి రచన ఎవరికోసం అన్నది మరొక ప్రశ్న. ఏ సాహిత్యమైనా పార్యంతికముగా అందరినీ ఉద్దేశించినా ఆయా ప్రక్రియలకు వస్తు విన్యాసానికీ, అభివ్యక్తి విశిష్టతకు కొన్ని పరిమితులు ఉంటాయి. అధికారులు ఉంటారు. **'యేషాంకావ్యాను శీలనవశాత్ విశభూతే మనోముకురే'** ఇత్యాదిగా అభినవగుప్తుడు చెప్పిన లక్షణం గల వారికి అందరికీ ప్రబంధం ఆస్వాద్యమే. ఈ అర్హత తప్ప మరేదీ ఇక్కడ పనికిరాదు. **'నీవైశిష్ట్యము తిట్టులన్ మెఱయునే నీ కంటే నే దక్కువే'** అన్నట్టుగా దూషణ విధానం ఎంతకాలం సాగినా ఆ ప్రబంధాల పునాది చెక్కుచెదరదు.

ఈ ప్రబంధయుగం తెలుగు సాహిత్యంలోనే కాదు - భారతీయ సాహిత్యంలోనూ మధ్యయుగాలలో సాధించిన గొప్ప విజయం. సంస్కృత కావ్యాలతో భుజాలు రాచుకోదగ్గ పద్ధతిలో తెలుగు కవులు రెండు మూడు శతాబ్దాలు వీటిని నిర్మించారు. ఒక్కో కవిది ఒక్కోవైలక్షణ్యం. కవి ప్రతిభావ్యుత్పత్తుల



సమప్రసారంలో నిర్మించినా నూతన అభివ్యక్తి మార్గం కొత్త భాషా సంప్రదాయాన్ని నిలబెట్టింది. తెలుగు సంస్కృత శబ్దాలు మైనంవలె కరిగి బహుళార్థ సాధకాలయినాయి.

**24**

యువ విద్వాంసుడు, ప్రాచీన, ఆధునిక సాహిత్యాలను లోతుగా అధ్యయనం చేసిన డా॥ తాడేపల్లి పతంజలి గారు ఆచార్య దుర్గయ్య గారి స్మారకోపన్యాసానికి ఆహ్వానింపబడటం, వారు ప్రసంగించడానికి సిద్ధపడటం నా కెంతో ఆనందం కలిగించే అంశం. ఈ సందర్భంలో శ్రీ పతంజలి గారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. విషయ సంభరితమై, ప్రబంధాలను ఆధునికులు ఏ విధంగా అధ్యయనం చేయాలో సూచిస్తూ సాగిన ఈ ప్రసంగ వ్యాసాన్ని చిరు గ్రంథరూపంలోనికి తీసుకువచ్చే ప్రయత్నం చేసిన **'సహృదయ'** సంస్థ కృషి అభినందనీయము.

ఈ ఉపన్యాస పరంపర ఇట్లాగే కొనసాగవలెనని, మన సాహిత్య సౌందర్యమును ఈనాటి యువతరానికి అందజేయటంలో సఫలం కావాలని కోరుకుంటున్నాను.

## ఒక మాట

ఆచార్య శ్రీలక్ష్మణమూర్తి

కీ.శే. ఆచార్య పల్లా దుర్గయ్య గారు మాకు గురుపాదులు. వారు ప్రబంధ సాహిత్యంపై విశేష కృషి చేసిన విద్వాంసులు.

అందుకే **సహృదయ** సాహిత్య సాంస్కృతిక సంస్థ వారు ప్రబంధ సాహిత్యంపై డా॥ తాడేపల్లి పతంజలి గారి ఉపన్యాసాన్ని ఏర్పాటు చేయడం ముదావహం.

బహుధా సుసంపన్నమైన తెలుగు సాహిత్య భవనానికి ప్రబంధ సాహిత్యం ఆధారశిలవంటిది. ప్రబంధ సాహిత్యంతో పరిచయం ఉన్నవారు ఆధునిక సాహిత్యాన్ని సంపూర్ణంగా, తలస్పర్శిగా ఆనందిస్తారు. ప్రబంధ సాహిత్య పరిచయం సాహిత్య రసికలోకానికి అత్యంత అవసరం. ఆ అవసరాన్ని **'సహృదయ'** వారు గుర్తించినారు.

ప్రబంధ సాహిత్యాన్ని గర్హిస్తూ అనవసర విమర్శ విస్తారంగా ఉండడం మూలాన ప్రబంధాలని రసికంగా, యుక్తియుక్తంగా, యోగ్యంగా కొత్తతరానికి పరిచయం చేయవలసిన అవసరం కలిగింది. డా॥ తాడేపల్లి పతంజలి అందుకు సమర్థులు. ప్రబంధాలను అధ్యయనం చేయడమే గాదు, నిండుగా ఆనందించిన సాహిత్యవేత్త. ఆయన నిస్తులమైన నిర్మలమైన ఆనందాన్ని తమ ప్రసంగ వ్యాసంలో ఆవిష్కరించి, మనకు మనో వికాసాన్ని కలిగించినారు. ఇప్పటి దాకా ప్రబంధ సాహిత్యంపై ప్రత్యక్షమైన పరిణత విమర్శను క్లుప్తంగా వివరించినారు.

ప్రబంధ పద్యరచన నిరుపమానమైనది. ప్రబంధం భావ శబలతకు పద్యమార్దవాన్ని కలిగించింది. దానితో భావం సుకుమారమూ, సుందరమూ అవుతుంది. ఆ సుకుమారతను, సుందర లక్షణాన్ని అమోఘమైన పద్యాలను ఉదహరిస్తూ ప్రసంగ వ్యాసాన్ని రమణీయంగా తీర్చినారు డా॥ పతంజలి గారు.

ఈ వ్యాసాన్ని తెలుగు సాహితీ రసికులందరూ చదవాలి. ఇందులో ఉదాహృతమైన పద్యాలనైనా కనీసం ఎల్లప్పటికీ మననం చెయ్యాలి. ప్రతి తెలుగు విద్యార్థి యీ వ్యాసాన్ని భద్రపరచుకోవాలి.

కీ.శే. పల్లా దుర్గయ్య గారి స్మరణలో నిర్వహించిన సభలో యీ ప్రసంగ వ్యాసం ఆవిష్కృతం కావడం ముదావహం.

**సహృదయ** నిర్వాహకులు అభినందనీయులు.



## 'సహృదయ' వాక్కు

**లలితము లార్ద్రముల్, సరస లాక్షణికంబులు, మంజులార్థ సం**
**కలితములున్ బ్రసన్నములు కర్ణసుఖంబులు, భారతీవధూ**
**గళ కలితాచ్ఛ మౌక్తిక సుఖంబులు, పావన తావకీన సూ**
**క్తులు, రమణీయమౌ తెనుగుతోటల బూచిన పూలు సత్కవీ !**

అంటూ 'కవి వాక్కు' ఎన్ని విధాలుగా ప్రతిభావంతమైనదో చెప్పిన కీ.శే. ఆచార్య పల్లా దుర్గయ్య గారు కేవలం కవి మాత్రమే కాదు, గొప్ప పరిశోధకుడు కూడా. వారి రచనలు **'గంగిరెద్దు', 'పాలవెల్లి'** వంటి కావ్యాలు ఎంత ప్రశస్తమైనవో వారి విమర్శనా గ్రంథాలైన **'చతురవచోనిధి అల్లసాని పెద్దన'** వంటి విమర్శ గ్రంథాలు వారి ప్రతిభకు పట్టిన కేతనాలు. విశేషించి **'ప్రబంధ వాఙ్మయం'** వారు చేసిన ప్రామాణిక పరిశోధన సాహిత్య లోకానికి ఒజ్జబంతి.

కీ.శే. ఆచార్య పల్లా దుర్గయ్య కారి శతజయంతిని పురస్కరించుకొని వారి పరిశోధనాంశమైన **'ప్రబంధముల'** పై ఆధునికుల అవగాహన ఎట్లా ఉండాలన్న ఆలోచన కలిగి ఈ ప్రసంగాన్ని ఏర్పాటు చేసింది **సహృదయ.**

డా॥ తాడేపల్లి పతంజలి గారు తలస్పర్శి పాండిత్యం కలిగిన కవి. పరిశోధకునికి ఉండవలసిన సర్వ సల్లక్షణాలు కలిగి ఉన్న డా॥ పతంజలి గారు 'ప్రబంధ సాహిత్యము – ఆధునిక సంతకం' పేర అనేక ప్రబంధాలను యీ కాలపు వారు ఏవిధంగా అధ్యయనం చెయ్యాలో వివరించిన, 2014 నవంబరు 9న ఏర్పాటు చేసిన పల్లా దుర్గయ్య గారి స్మారకోపన్యాసాన్ని ముద్రణ రూపంలో సహృదయ అందిస్తోంది. సోదాహరణంగా ఉదాహరించిన ఈ విషయం విస్తృతమైనది – అయినా అనేక ప్రబంధాల అధ్యయనాన్ని లోతైన అవగాహనతో డా॥ పతంజలి గారు వివరించిన తీరు సుందరంగా ఉంది. ఈ ప్రసంగ వ్యాసాన్ని ముద్రించి అందించాలన్న మా సంకల్పానికి అంగీకరించిన డా॥ పతంజలి గారికి సమగ్రమైన ప్రబంధ సాహిత్యాన్ని గురించి చెబుతూ దీనికి **'నివాళి ఔన్నత్యం'** అందించిన ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య గారికి, **'ఒకమాట'**లోనే ఆశీస్సులు అందించిన మాన్యులు ఆచార్య శ్రీలక్ష్మణమూర్తి గారికి ఈ చిరుగ్రంథ ముద్రణకు సహకరించిన సహృన్మిత్రులు శ్రీ ఎం. వేంకటేశ్వర రావు గారికి **'సహృదయం'తో** కృతజతాపూర్వక నమస్సులు తెల్పుకుంటున్నాము.

**– సహృదయ, వరంగల్లు**

ప్రబంధమనే పేరు తెలుగు సాహిత్యంతో అంతో ఇంతో పరిచయం ఉన్నవారికి సుపరిచితం. ప్రబంధమంటే 18 వర్ణనలుండేది(విన్నకోట పెద్దన; కావ్యాలంకార చూడామణి3-91) ప్రబంధమంటే వర్ణనలతో పాటు రసాభివ్యక్తికి, పాత్ర చిత్రణకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చి, శబ్దాలంకార సహితంగా ఉండేది (పింగళి లక్ష్మీకాంతం; సాహిత్య సమాలోచనము పే.55)కేవలాంధ్రీకరణలు కాని రచనలు ప్రబంధములు(కందుకూరి వీరేశలింగము; కవుల చరిత్ర 1వ భాగము పీఠిక)రచనా విధానములో , కథావస్తువులో , పాత్ర చిత్రనలో , రస పోషణములో, అలంకార వర్ణనాదికములో ప్రబంధము కొత్త రీతులను సంతరించుకొన్న కావ్య ప్రక్రియ ప్రబంధము.(డా.సి. నారాయణ రెడ్డి;ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు- ప్రయోగములుపే.119)ఇలా శ్రీయుతులుదివాకర్ల, కాకర్ల, జివిసుబ్రహ్మణ్యము మొదలైన పెద్దలెందరో ప్రబంధాలను నిర్వచించారు.

**ప్రబంధాలుగా పేరు పొందిన పుస్తకాలు**

మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, కాళహస్తీశ్వర మాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యము, రాజశేఖర చరిత్ర, రామాభ్యుదయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము, కవికర్ణరసాయనము, నిరంకుశోపాఖ్యానము, తపతీ సంవరణోపాఖ్యానము,

వైజయంతీవిలాసము, సారంగ ధర చరిత్రము, విజయ విలాసము, రాజగోపాల విలాసము, మన్నారుదాస విలాస ప్రబంధము, ఉషాపరిణయము, అహల్యా సంక్రందనము, తారాశశాంక విజయము, బహుళాశ్వ చరిత్రము, రసిక జన మనోభిరామము, కవిజన రంజనము, అనిరుద్ధ చరిత్రము, కవిరాజ మనోరంజనము, శకుంతలా పరిణయము మొదలైనవి ప్రబంధాలుగా పేరు పొందాయి.. వీటిలో మనుచరిత్ర మొదలైన ప్రబంధాలను కావ్యాలుగా కూడా పేర్కొంటారు.

## ప్రబంధాలపై నేటి చూపు

ఆధునిక తరం ప్రశ్నించే తరం.

ఎందుకు అది చదవాలి? ఎందుకు అది పాటించాలి? ఎందుకు నువ్వు చెప్పినది వినాలి? – ఈ ప్రశ్నలకు సంతృప్తిగా జవాబు దొరికితేనే నేటి తరం వినటానికి, చదవటానికి ఇష్టపడుతోంది.ఈ అత్యాధునిక కాలంలో ప్రాచీన ప్రబంధాలను ఎందుకు చదవాలి? చదవకపోతే వచ్చే నష్టమేమిటి? విద్యార్థుల పాఠ్య ప్రణాళికల్లో తీసేస్తే వచ్చే నష్టమేమిటి? –అనే ప్రశ్నలు వస్తున్నాయి.

కొడవటిగంటి కుటుంబరావు మొదలయిన ప్రసిద్ధులయిన ఆధునికులు మనుచరిత్ర మొదలయిన వాటిని బూతు కథలుగా లెక్కించారు. (కొడవటిగంటి కుటుంబరావు నవల 'ఐశ్వర్యం' కుటుంబరావు సాహిత్యం. మొదటి సంపుటం.

ప్రథమ ముద్రణ - జనవరి, 1982. పేజీలు .. 143 - 144 ) సమకాలీనపు సాహిత్య పేజీలలో ప్రసిద్ధమైన కళా పూర్ణోదయ కావ్యము కళా 'పోర్నో'దయముగామారి నిరసించబడింది ( ఆంధ్ర జ్యోతి. వివిధ) ప్రజలకు దూరమైన గ్రంథముగా ప్రబంధాన్ని కొంతమంది విమర్శకులు భావించారు.( వేల్చేరు నారాయణరావు;తెలుగులో కవితా విప్లవాల స్వరూపము) ఈ నిరసనలన్నింటికీ జవాబులు ఇచ్చి ప్రబంధాల గొప్పతనం చెప్పి వాటిపట్ల సహానుభూతిని పెంచవలసిన అవసరం సాహితీపరులపై ఉంది.ఈ ప్రసంగ పత్రం ఆ అన్వేషణా ప్రస్థానంలో ఒక అడుగు.

## ప్రబంధాలను ఇందుకు చదవాలి

1. మీగడతరకలవంటి కొన్ని ఘట్టాలకోసం
2. ఆధునిక వజ్ర సౌధాలకు కావలసిన సంప్రదాయ పునాదుల కోసం

3. గుండెల్లో చిమ్మే నగ్న భావాలకు సముచిత సశక్తిక శబ్దాలను తొడగటానికి
4. విజ్ఞాన సీమలను , ఆలోచనా వలయాలను విస్తృతపరిచేటందుకు
5. చెప్పదలుచుకొన్నది సూటిగానే కాకుండా సుందరంగా చెప్పే సవ్యసాచిత్వం సంతరింపజేసుకొనేటందుకు
6. చిక్కని ఊహలకు రెక్కలిచ్చి అనంత వియత్పథాలలో ఎగరగలిగే మొక్కవోని ఓజస్సుఅందించేటంతవరకు
7. తెలుగు నుడికారపు నిగారానికి
8. ధర్మ పాక్షికతకు
9. సుకుమార భావుకతకు
10. సునిశిత మానవ మనః పరిశీలనా చణతకు

పై అభిప్రాయాలు నావి కావు. నిన్నటి తరానికి , నేటి తరానికి మధ్య సమన్వయ వారధిగా, గతములోని మంచిని సంప్రదాయంగా నిర్వచించిన జ్ఞాన పీఠ అవార్డు గ్రహీత డా. సి. నారాయణరెడ్డి గారివి.(యువ భారతి కావ్యలహరికి వ్రాసిన సార సౌరభము అనే పీఠిక నుండి)

పై అభిప్రాయాలను కొన్ని ప్రబంధాల మూలాల్లో విస్తృతంగా పరిశీలిద్దాం.

**మనుచరిత్ర**

ప్రబంధము అనగానే మొట్టమొదట అందరికి గుర్తుకు వచ్చేది మనుచరిత్ర.ఆంగ్లములోకి కూడా అనువాదము పొందిన అతి తక్కువ ప్రబంధాల్లో ఇది ఒకటి. ఇందులో మీగడతరకలవంటి ఘట్టం వరూధినీ , ప్రవరుల ప్రథమ సమావేశం.

ఇంతలు కన్నులున్న అందగాడు – ప్రవరుడు అధర్మానికి "ఊహూ"

అందగత్తె –వరూధుని అధర్మానికి "ఊ"

ఈ ఊ , ఊహులకు పెద్దన హిమాలయంపై నిర్మించిన నాటక రంగం అనితర సాధ్యం.

ఈ ఘట్టంలో వరూధుని సంభాషణా చాతురి అక్షరముగ్ధులను చేస్తుంది. బ్రహ్మానందానికి వరూధుని ఇచ్చిన కపట భాష్యము నిజమేనేమో అనిపాఠకులకు అనిపిస్తుంది. చివరికి ఈ ఘట్టంలో కవి వరూధుని పక్షాన చేరి ఆమెను విడిచిపెట్టి వెళుతున్న ప్రవరునిపై సూర్య వర్ణనలో అలుగుతాడు..

**"తరుణి ననన్య కాంత నతి దారుణ పుష్ప శిలెముఖ వ్యథా**

**భరవివశాంగి నంగభవు బారికి, నగ్గము సేసి, క్రూరుడై**

**యరిగె, మహీసురాధము దహంకృతితో నని రోషభీషణ**

**స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చె కషాయదీధితిన్.."**

తనను వలచి వచ్చిన స్త్రీని దూరంగా తోసి వేసిన ప్రవరునిపై అలిగిన సూర్యుని ముఖం ఎర్రబారింది.అస్తమయ సమయంలో సూర్య బింబం ఎర్రగా ఉంటుంది. ఆ ఎర్రదనాన్ని కవి ఇక్కడ చమత్కరించాడు.ప్రవరుని నిందించిన ఈ పద్యము పెద్దన వ్రాసి ఉండడని పుట్టపర్తి వారు అభిప్రాయ పడ్డారు. ఇక్కడ చమత్కారం ప్రధానమేమో అనిపిస్తుంది.

మంచి వేసవి కాలంలో కొంచెం సేపు స్నానఘట్టాలలో దిగి ఈత కొట్టి మళ్లీ పైకి వద్దామనుకొంటాము. ఒడ్డుకు చేరిన వెంటనే మళ్లీ ఘట్టంలోకి దిగాలనిపిస్తుంది.మనుచరిత్రలోని ఘట్టాలు కూడా అంతే.శబ్దార్థ పుష్టితో దిగామా! తొందరగా బైటికి రాలేము.అంతగా అవి ఆకర్షిస్తాయి.

పైన చెప్పిన వరూధుని ప్రవర ఘట్టములోనే ధర్మ పాక్షికత కవి అన్ని కాలాలవారికి నేర్పాడు.

ఆధునిక కాలంలో వయసులో ఉన్న పెళ్లయిన ఒక అబ్బాయి ,పట్నానికి వెళ్లాడు. అనుకోకుండా.అతనికి ఏకాంతము దొరికింది. తనంటే ఇష్టపడే ఒక కాంత దొరికింది.ఆ సమయంలో ఆ అబ్బాయి ప్రవర్తన ఎలా ఉండాలో. ఎలా ఉంటే సంస్కార పూరితమైన భారతీయ సమాజానికి ప్రతినిధి అవుతాడో , మనుచరిత్ర

ప్రబంధం చెబుతుంది.నాకు ఈ రకమైన సంస్కారము అక్కరలేదనుకొనేవారికి ఏమి చెప్పలేము కాని- ఉత్తమ సంస్కారము కావాలనుకొనేవారు మాత్రము మనుచరిత్రలోని ఈ ఘట్టము తప్పనిసరిగా చదవాలి.

పెళ్లయిన ప్రవరుడు అనే అబ్బాయిని –ఏకాంతంలో - వరూధుని అనే అమ్మాయి ఇష్టపడింది. తనకి పెళ్లయిందననే విషయం చెబుతాడు ప్రవరుడు. అయినా లెక్కచేయక మాటలతో సుఖాల మేడలు కట్టి ఊరిస్తుంటే '**చెప్పకుమిట్టి తుచ్ఛ సుఖముల్ మీసాలపై తేనియల్**''అని ప్రవరుడు ఆమెను నిరసిస్తాడు. మీసంపై తేనె నాకుతుంటే పరిపూర్ణత లభించదు.అందినట్లే అంది కష్టం కలిగిస్తుంది.వివాహేతర సంబంధాలు కూడా ఇటువంటివే అని మనుచరిత్ర ప్రబంధ సందేశం.

పరకాంతకు లొంగని ప్రవరుని ధర్మ పాక్షికతను కవి ప్రశంసిస్తూ '**కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్** 'అంటాడు.

ధైర్య చిత్తములు ఉన్నవారు ఆకర్షణల వలలకు లొంగరు. అంటే యువతీయువకులు మాయాజాలంలో పడి, పండంటి జీవితాలను నాశనం చేసుకోవద్దని మనుచరిత్ర అనే ప్రాచీన ప్రబంధ సందేశ దీపము ,ఈ అత్యాధునిక ఎయిడ్స్ సమాజంలో అవసరమే అనే విషయం ఎవరూ కాదనలేనిది. భోగములపై ఉన్న కాంక్షకు, ఇంద్రియ నిగ్రహానికి మధ్య జరిగిన యుద్ధములో ఇంద్రియ నిగ్రహము గెలిచింది. 'ధర్మాధీనమైన

కామమే సమాజానికి రక్ష' అన్న సందేశం వరూధినీ ప్రవరుల ఘట్టం ఇస్తుందన్న పల్లాదుర్గయ్య గారి అంచనా అక్షర సత్యం.(ఆంధ్ర ప్రబంధము-అవతరణ వికాసములు)

వరూధునిని ప్రవరుడు తోసివేసిన సందర్భములో 'హా! శ్రీ హరీ ' అంటాడు కదా 'హా! శ్రీ హరీ ' అని ఎందుకన్నాడో కరుణశ్రీ గారు ఇలా చక్కగా చెప్పారు.

'హా! శ్రీ హరీ ' అన్నప్పుడు గాలి బయటకు వెళుతుంది. అంటే ప్రవరుడు తన ముఖం పక్కకు తిప్పుకోవడంలోనే కాకుండా, తన వాచికంలోనూ అయిష్టత ను చూపించదలిచాడు. అందుకే హా శ్రీహరీ! అనే ప్రయోగము.

ఒక వీణపై ఏరాగాన్ని ఏ సమయంలో మోగించాలో తెలిసిన కవి చెలికత్తెల ద్వారా ఆ విషయాన్ని వరూధునికి చెప్పించాడు.(వాలారు కొనగోళ్ల 03-05)తాంబూలంలో కస్తూరిని ఆడవాళ్లు , మగవాళ్లు ఎన్ని పాళ్లు వేసుకోవాలో తెలిపి

చదువరులను ఆశ్చర్య చకితులను చేస్తాడు.

మృగమద సౌరభ విభవ/ద్విగుణితఘనసార సాంద్రవీటీగంధ

స్థగితేతర పరిమళమై/ మగువ పొలుపు తెలుపు నొక్క మారుత మొలసెన్(02-24)

సిద్ధుడు లేపనము ఇచ్చి వెళ్లిన తరువాత ప్రవరుడు హిమాలయము చేరుకొంటాడు. ఇక్కడ హిమాలయంలో ఎత్తు పల్లాలు ఎలా ఉన్నాయో చెబుతూ పెద్దన గారు చెప్పిన పద్యమిది

ఆ మందిడి యతడరిగిన/భూమీసురుడరిగె దుహిన భూధరశృంగ

శ్యామలకోమల కానన/హేమాఢ్య దరీ ఝరీ నిరీక్షాపేక్షన్(01-79)

ఈ పద్యంలోని హ్రస్వాక్షరాలను దీర్ఘాక్షరాలను, సంయుక్తాక్షరాలను జాగ్రత్తగా చదువుకొంటూ వెళితే హిమాలయం కనబడుతుంది.అట జని కాంచె పద్యము కూడా హిమాలయ సాక్షాత్కారాన్ని కలిగిస్తుంది.

ఎందుకండి అలా వ్రాయటం? అక్కడ సరస్సులున్నాయి. నెమళ్లున్నాయి ..ఇలా విషయము చెబితే సరిపోతుంది కదా!హిమాలయాన్ని కళ్లముందు నిలపటానికి కవి ఎందుకు అంత శ్రమ పడ్డాడు ? అంటే రచనాపరమైన ఒక అద్భుత సౌందర్యము కవిత్వంలో చెప్పటానికి.

విశ్వనాథ సత్యనారాయణ -శివధనుస్సు విరిచే సందర్భంలో – ఆ చప్పుడును వినిపిస్తూ 'నిష్ఠావర్ష దమోఘు' అనే పద్యము రాసాడు. ఒకసారి ఆయన కల్పవృక్షము మీద మాట్లాడుతుంటే ఒక సామాన్య పాఠకుడు లేచి "ఎందుకండి..అంత అర్థం కాని సమాసాలు వేస్తారు.శివధనుస్సు విరిగిదని మాములు మాటల్లో చెబితే సరిపోతుంది కదా !'అన్నాడు.

‘‘బాబూ! సైకిల్ మీద బజారులో వెళుతున్నావు. నీ టైరు పంక్చరయింది.ఆ విషయాన్ని ఇంట్లో చెప్పే సందర్భంలో టైరు ఢామ్మని పేలిపోయిందని చెబుతావా?లేదా!అక్కడ ఢా అనే అక్షరము టైరు పేలిన చప్పుడును చక్కగా చెబుతుంది.అలాగే శివధనుస్సు విరిగిన శబ్దం మూడు లోకాల్లో వినిపించాలంటే , ఆశబ్దం ఎంత ఉండాలో అంత ఉండటానికి ఆ పద్యము వ్రాసానని విశ్వనాథ చెప్పాడు.

మనం వ్యావహారికంలో ఎటువంటి భాషను వాడుతామో కవులు కూడా అలాగే సందర్భానుగుణంగా ఆ శైలిని వాడుతారు.ఇది భాషాపరంగా ఆధునిక కవులు ప్రాచీన ప్రబంధాలనుంచి నేర్చుకోవలసిన పాఠం. ఈ పాఠాలు నేర్చుకోవటానికి ప్రాచీన ప్రబంధాలు చదవాలి.

ఆనాటి సమాజంలో ఉన్న కొన్ని విషయాలను పెద్దన మనుచరిత్రలో పొందుపరిచాడు.ఆనాటి విజయనగర సామ్రాజ్యంలో ‘రతనాల అంగళ్లు అమ్మినారనే విషయాన్ని కవి చెప్పాడు.(ప్రభిన్న గజఘోట)ఈ కాలంలో మనము గాయకులను, నటులను గౌరవిస్తున్నాము.ఆనాటి సమాజంలో నటులన్నా, విటులన్నా, గాయకులన్నా ఒక విధమైన అసహ్య భావముండేదని తెలిసి మనం ఆశ్చర్య చకితులమవుతాము.(1.నట విట గాయక, 2.ఆహా ధన్యుడ)

మనుచరిత్ర అనగానే దారి తప్పిన శృంగార ప్రసక్తిగల పద్యాలు (ఉదా. నిక్కముదాపనేల మొ.) తెచ్చి చాలమంది ఆధునికులు గేలిచేస్తుంటారు. దారి తప్పిన శృంగారాన్ని పెద్దన నిరసించిన ఘట్టము కూడా వీళ్లు గమనించాలి.తనను కోరిన హరిణాంగనలను చూసి మగలేడి హుంకారంబొనరించి ‘‘వేతొలగుడొహో! నేను స్వారోచినే ? పంకేజాక్షులతోడ నెల్లప్పుడు దర్పస్ఫూర్తి గ్రీడింప”అని ముగ్గురి భార్యలతో క్రీడిస్తున్న స్వరోచి వర్తనాన్ని నిరసిస్తుంది.

ఆధునిక కాలంలో బాగా ప్రాచుర్యము పొందిన మనసు అనే పదాన్ని తొలిసారి ప్రయోగించిన కవి అల్లసాని పెద్దన.

(నిక్కము దాపనేల ధరణీసుర నందన యింక నీపయిన్/జిక్కెమనంబు )

ఆధ్యాత్మిక పరంగా ప్రతీకాత్మకంగా మనుచరిత్రలో ప్రవృత్తి మార్గము, నివృత్తి మార్గము వివరించబడ్డాయి. లోచూపుతో వీటి అన్వేషణ చేయాలి.

## వసుచరిత్ర

రామరాజ భూషణుడను ఇంకో పేరుతో ప్రసిద్ధుడైన భట్టు మూర్తి రచించిన వసుచరిత్ర అనే ప్రబంధం, అనేక పిల్ల వసుచరిత్రలకు కారణమై- ఆధునిక పరి భాషలో చెప్పాలంటే క్లోనింగ్స్(సారూప్య ఉత్పత్తి

ప్రక్రియ) పొందిన కావ్యము. ఆ కావ్యమంటే తెలుగు నాట అంత మోజుగా ఉండేది.వసురాజు ఇందులో నాయకుడు. గిరిక నాయిక.

కోలాహలమనే పర్వతము శుక్తి మతీనదిని అడ్డగిస్తే తన కాలిబొటన వేలితో ఆ పర్వతాన్ని గవ్వలాగా వసురాజు చేసాడు.ఈ విషయము తెలుసుకొన్న ఇంద్రుడు వసురాజుని స్నేహితునిగా స్వీకరించాడు.విమానమును బహూకరించాడు.ఒకసారి విహార యాత్రలో గిరిక, వసురాజులిద్దరూ కలుసుకొంటారు.ఆ ఇద్దరి ప్రేమికులకు వివాహమవుతుంది.ఇదే సూక్ష్మంగా ఇందులో కథ.

భారతము ఆది పర్వములో ఉన్న ఉపరిచర వసు మహారాజు వృత్తాంతము ఈ వసుచరిత్రకు మూలం.మూలాన్ని వసుచరిత్ర కారుడు ఎంత అందంగా తీర్చి దిద్దాడో ఆధునిక కవితా ప్రేమికులు తెలుసుకొని గ్రహించవలసి ఉంది

గిరికాజన్మ వృత్తాంతము ప్రబంధంలో మొదట ఉండాలి. దానిని కవి ద్వితీయాశ్వాస మధ్యములో పెట్టాడు.దీనివలన కథా కథనంలో చమత్కారము వచ్చింది.మూలములో వసురాజుకు నర్మ సచివుడనే స్నేహితుడు కాని, గిరిజకు మంజువాణి అనే స్నేహితురాలు కాని లేరు.వీళ్లిద్దరూ భట్టు మూర్తి కల్పితాలు.

ఇప్పుడంటే యస్సెమెస్సులు, చాటింగులు , ఈ మెయిళ్లు, ఫేస్ బుక్ పోష్టింగులు- ఇలాంటివి వచ్చి ప్రేమికులకు మధ్యవర్తుల అవసరం బాగా తగ్గిపోయింది. నీకోసం అతడు బెంగపెట్టుకొన్నాడు. నీకోసం ఆమె ఇంకో పని చేయటము లేదు. మధ్యవర్తుల ద్వార–ఇలాంటి మాటలు వింటున్న ప్రేమికులకు కలిగే ఆనందము వర్ణనాతీతముగా ఉంటుంది. తనంటే ఇంత ప్రేమ అని పొంగి పోయి,ఎదుటి వాళ్లపై ప్రేమను ఇంకా పెంచుకొంటారు.ఇలా ప్రేమ ఎలా వర్ధిల్లాలో వసు చరిత్ర చెప్పింది.

వసు చరిత్రలో కథ కంటే ఆధునికులు పొంగి పోవలసినది వర్ణనలకు.

ముక్కు మీద భట్టు మూర్తి చెప్పిన పద్యము చాల ప్రసిద్ధమైనది

**నానాసూనవితానవాసనలనానందించుసారంగ మే**

**లానన్నొల్లదటంచుగంధఫలిబల్మాకందపంబంది యో**

**షానాకృతిఁబూనిసర్వసుమనస్సౌరభ్యసంవాసమై**

**పూనెంబ్రేక్షణమాలికామధుకరీపుంజంబునిర్వంకలన్!2.47**

అన్ని పూల వాసనలనూ ఆస్వాదించే తుమ్మెదలు సంపెంగ జోలికి పోవట.అందుకని ఆ సంపెంగ పూవు తపస్సు చేసి. అన్ని పూల వాసనలను పీల్చే ముక్కుగా మారిందట. మగ తుమ్మెదలమీది కోపంతో ఆడ

తుమ్మెదలను ..అటూ ఇటూ తన కనుబొమ్మలుగా మార్చేసుకొందట. "ఓ తుమ్మెదలారా ! సంపెంగ పువ్వు అవతారంలో ఉన్నప్పుడు నాదగ్గరికి రాలేదు . ఇప్పుడు నాయిక ముక్కుగా మారాను. రాకుండా ఎలా ఉంటారో చూస్తాను"అని పందెం కాసింది. అసలు ఈ పద్యము నంది తిమ్మన గారిదట. భట్టుమూర్తిగారు డబ్బిచ్చి కొనుక్కొన్నారట. కథకు కాళ్లు లేవు. ముంతకు చెవుల్లేవు.

ఇటువంటి మనోహరమైన వర్ణనలు వసుచరిత్రలో చాల ఉన్నాయి.

**హరిదంభోరుహలోచన ల్గగనరంగాభోగరంగ త్తమో**

**భర నేపథ్యము నొయ్య నొయ్య సడలింప న్, రాత్రి శైలూషికిన్**

**వరుస న్ మౌక్తికపట్టము న్, నిటలము న్, వక్త్రంబునుం దోఁచె నా**

**హరిణాంకాకృతి వొల్చె రే కయి, సగం బై, బింబ మై తూర్పున న్.**

ఇది చంద్రోదయ వర్ణన. ఇందులో కవి ఆనాటి సామాజిక వినోద సరంజామా దించేసాడు.

గగనరంగ మనే విశాల రంగస్థలం

దాని మీద మీద రాత్రి అనే  నాట్యగత్తె  నాట్య ప్రదర్శన చేయబోతోంది.

ముందుగా  పద్మలోచనలు తాము పట్టుకున్న చీకటి అనే తెఱను మెల్లమెల్లగా కిందికి జారుస్తున్నారు.

అ రాత్రి అనే నాట్య గత్తెకు మౌక్తిక పట్టము, నుదుటి భాగము నిండుముఖమూ కనిపించాయి. అలాగే తూర్పున చందమామ మొదట వంకర రేక గా ,సగ భాగముగా, తఋవాత పూర్ణబింబము గా వరుసగా కనిపించినదట.

పూర్వకాలం వీధి నాటకాల్లో పాత్రను పరిచయం చేసేముందు ఆ పాత్రకి అడ్డంగా పట్టుకున్న తెరని నెమ్మది నెమ్మదిగా కొంచెం కొంచెంగా తలనుంచి క్రిందికి తీసివేస్తుంటారు.ముందుగా తలమీది పాపిడి బిళ్ళ కనబడుతుంది.తర్వాత వరుసగా నుదురు, కళ్లు, ముక్కు, కంఠ హారాలు, – ఇలా ఒక్కొక్కటీ కనిపింపచేస్తూ తెరని చివరికి లాగేసేవారు, దీనిని చంద్రోదయంతో కవి పోల్చాడు.

చంద్రుడు ముందు రేఖలాగా, తర్వాత అర్ధచంద్రుని లాగా, ఆ తర్వాత పూర్ణ బింబంగా తూర్పు దిక్కున కనిపిస్తుంటాడు. ఇలా ఆనాటి సామాజిక వినోద ప్రక్రియకు కవి శాశ్వతత్వం కలిగించాడు.

మనస్సును ఊపేసే భావ సౌందర్యము కావాలనుకొనే వారు చదువవలసిన మరొక వసుచరిత్ర పద్యమిది

అలరుంగైదువుజోదు కూర్మిసయిదోడై మాధవశ్రీతపః
ఫలమై యాడు మరుత్కుమారు బ్రియమొప్పం దేనె నీరార్చి లే
దెలిపూజొంపపు బొత్తులన్ బొదిగి ధాత్రీజాతముల్ జోల వా

డె లసత్పల్లవడోల నుంచి కలకంఠీనాదగీతంబులన్

వసంతము గాలి అనే ముద్దుల పిల్లవాడికి ప్రేమతో పూల తేనెతో స్నానము చేయిస్తోంది. లేతవైన తెలతెల్లని పూలపొదల పొత్తిళ్ళతో కప్పుతోంది. చెట్లు చిగురాకుల ఊయలలో పడుకోబెట్టి. కోయిలమ్మలు పాడే పాటలతో జోల పాడాయి.

గాలిని పసి పిల్లవాడిగా చేసిన ఈ భావము అపురూపము. ''**కవిః కరోతి కావ్యాని , రసం జానాతి పండితః**

**తరుః సృజతి పుష్పాణి , మరుద్వహతి సౌరభమ్**''(కవి కావ్యాలను సృష్టిస్తాడు. పండితుడు రసాన్ని గ్రహిస్తాడు. చెట్టు పువ్వులను కాస్తుంది.గాలి దాని వాసనని మోస్తుంది.) అనే శ్లోకంలో ఎంత అందంగా గాలిని పేర్కొన్నాడో , భట్టుమూర్తి పద్యములో కూడాగాలి అందంగా చెప్పబడింది..

వసుచరిత్ర కథలో ఉపరిచర వసు వృత్తాంతము, ఇంద్ర వృత్రాసురుల కథ, జలము యొక్క కథ అను మూడు పొరలు ఉన్నాయని అద్భుతమైన ప్రతీకాత్మకమైన విశ్లేషణ చేసారు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులవారు .(వసుచరిత్ర పీఠిక;సాహిత్య అకాడమీ ప్రచురణ1967. X, XX, పేజీలు)

రామరాజ భూషణుని పద్య రచన ఆయనే చెప్పినట్లు "వీనులవిందై అమృతపు /సొనలపొందై యమందసుమచలదళిసీ గానముక్రందై".(2-14)ఉంటుంది.

గిరికను అత్తవారింటి కి పంపే సందర్భంలో శుక్తిమతి చెప్పిన ఈ పద్యము వీనుల విందుగా ఉంటుంది.

తమ్ములబంపుదున్ మణి శతమ్ములబంపుదురాజహంస పో

తమ్ములబంపుదున్ బరిచి తమ్ములగానన దేవతాళి జా

తమ్ముల బంపుదున్ ద్రుత గతమ్మున నేనును సారణీ ప్రపా

తమ్ముల వత్తు విశ్వ విదితా ముదితామది తాపమేటికిన్ (06-60)

గిరికా ! నీ తమ్ములను నీ వద్దకు పంపిస్తాను (కమలములనుపంపుతానని రెండో అర్థము). రకరకాల ముక్తామణులను పంపిస్తాను .రాజహంస పిల్లలను పంపుతాను. నీకు బాగా తెలిసిన వన దేవతలను పంపుతాను. నేను కూడ(శుక్తిమతీనది) వేగంగా సెలయేటి రూపంలో వస్తాను. బాధపడకు. (విశ్వవిదితా! మది తాపమేటికిన్?). శుక్తిమతి నది. కమలాలు, మణులు, రాజహంసలు- ఇవి సహజంగా ఉండేవి. తానూ కూడా తనరూపాన్ని తగ్గించుకొని కూతురు అత్తవారింటికి వస్తానంటున్నది. ఆడపిల్లను కన్నతల్లి కదా! వియ్యలవారింట్లో తగ్గి ఉండాలి.అందుకే తగ్గి ఉండటము. అప్పట్లో కూడా ఈ అత్తల బాధలు –అవి

ఉండేవేమో! సమకాలీన సమాజాన్ని అందమైన భావనలతో పాటు తన పద్యంలో కవి నిబంధించాడు.తమ్ముల అనే పునరుక్తి కృతకంగా కాకుండా, స్వాభావికంగా వసు చరిత్ర ప్రబంధంలో కుదురుకొంది.

మృదంగ ధ్వనిని ఒక పద్యంలో సమర్థంగా భట్టు మూర్తి చెప్పాడు

ఉద్ధర రిపు విద్ధ తపన/ పద్ధతి కరి భవనదవనిపటదమ్బుధి సం
పద్ధరణ సముద్ధరణ స/ మిద్ధరణ రజో వ్రజోద్యదిభమద సృతికిన్(01-89)

తెలుగువారికే సొంతమైన పద్యంలో ఇటువంటి అద్భుత పద ప్రయోగాలున్న ప్రబంధాలను చదవకపోతే చాల కోల్పోతాము.

పుట్ట పర్తి వారు చెప్పినట్లు వసంత కాలములో రామరాజ భూషణుడు చేసిన సంగీత ''కచ్చేరి' ఇది

లలనాజనాపాంగ వలనా వసదనంగ తులనాభికా భంగ దోఃప్రసంగ
మలసానిలవిలోల దకళసాసవరసాలఫలసాదరశుకాల పన విశాల
మలినీగరుదనీక మలినీకృతధునీకమలినీసుఖిత కోక కుల వధూక
మతికాంత సలతాంతలతికాంతరనితాంతరతికాంతరణతాంత సుతను కాంత
మకృతకామోదకురవకావికల వకులముకుల సకలవనాంత ప్రమోద చలిత

**కలితకలకంఠ కులకంఠకాకలీవి/భాసురమువొల్చు మధుమాస వాసరంబు (1-13)**

వసు చరిత్రలో ఇటువంటి సంగీత మిళితమైన పద్యాలు ఎన్నో ఉన్నాయి.

ఇటువంటి సంగీత పరమైన పద్యాలు వ్రాయటానికి ఆ కవికి ఎంతో పాండిత్యము కావాలి. అధ్యయనము కావాలి. కృషి కావాలి.శక్తి కావాలి.ఆ అధ్యయనాన్ని ఆమోదించే రసికతను ఈ జాతి కోల్పోకూడదు.

విచిత్రమేమిటంటే చక్కటి ప్రబంధము రచించిన రామరాజ భూషణుని ఇంటి పేరు ప్రబంధాంకము వారు.మనుచరిత్ర వేకటి వరకు, వసుచరిత్ర చీకటి వరకు బాగుండునని పండితలోకములో ఒక వాడుక. దీనిపై సమగ్ర పరిశోధన జరగాలి.

**పారిజాతాపహరణము**

ముక్కు తిమ్మన అని ఇంకో పేరున్న నందితిమ్మన వ్రాసిన ఇంకో ప్రబంధము పారిజాతాపహరణము. నాయకుని చేత నాయిక కాళ్లు పట్టించిన మృదు భావ మంటపము .

కృష్ణుడు పారిజాతాన్ని రుక్మిణికి ఇవ్వగా , అలిగిన సత్య భామ కోపగృహానికి వెళుతుంది.అమె అలక తీర్చిన కృష్ణుడు పారిజాత వృక్షాన్ని ఆమె పెరటిలో నాటిస్తాడు. నారదుని సలహాతో పుణ్యక వ్రతము చేసిన

సత్యభామ కృష్ణుని –నారదునికి దానము చేసి, మళ్ళీ తనదగ్గరున్న సొమ్ములతో భర్తను కొనుక్కొంటుంది.కథ చాల చిన్నది.కాని రచించిన తిమ్మన వర్ణనా ప్రతిభ గొప్పది.

ఒక మనస్సు మార్చటానికి, ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి వ్రాసిన మొట్టమొదటి ప్రబంధము పారిజాతాపహరణము.సాహిత్యము ద్వార మనుషులిని మార్చవచ్చు అని నిరూపించిన ప్రబంధము ఇది.

ఒక పురుషుని అహంకారము కావ్యము వ్రాయటానికి మూల కారణమయింది. కావ్యములోని ఒక స్త్రీ అహంకారము ,రాజు అనబడే ఒక పురుషుని అహంకారము పోవటానికి, కాపురము చక్కబడటానికి కారణమయింది.అందరికి ఇది తెలిసిన విషయమైనప్పటికీ, మరొకసారి ప్రస్తావించుకొందాం.

శ్రీకృష్ణదేవరాయలు – ఒకసారి తిరుమలదేవి అంతఃపురానికి రాత్రి పూట ఆలస్యంగా వెళ్లాడు.భర్త వచ్చేంతవరకు కాళ్ల వైపు తలపెట్టుకొని పడుకోవటము ఆనాటి సంప్రదాయము కనుక తిరుమలదేవి , పానుపుపై కాళ్లవైపు తలపెట్టుకొని పడుకొన్నది.రాయలవారు ఆమెనిద్రని చెడగొట్టడము ఇష్టం లేక , ఆమెని లేపకుండా పానుపుపై ఇంకో పక్క మాములుగా పడుకొన్నాడు.నిద్రలో పొరబాటున తిరుమలదేవి కాళ్లు రాయలవారిని తాకాయి.పురుషుడిని అనే అహంకారంతో , కాళ్లతో తన తలను తాకినందుకు ఆమెకు శిక్షగా , ఆమె అంతఃపురానికి రావటము మానుకొన్నాడు. మొదట ఆమె కాళ్ల వైపు తలపెట్టుకొని పడుకొన్నప్పటి

ఔదార్యము , కాళ్లు తగిలేసరికి ఎగిరిపోయింది. తాను పురుషుడనని, ఆమె స్త్రీ అని రాయలు అనే పురుషుడు అహంకరించాడు.

ఈ విషయము తెలుసుకొన్న ముక్కు తిమ్మన- స్త్రీ కాళ్లకు పురుషుని చేత మొక్కించిన పారిజాతాపహరణము కావ్యము వ్రాసాడు. ఇది చదివిన రాయలలోని పురుషాహంకారము తగ్గి, తిరుమలదేవిఇంటికి యథాతథముగా రాకపోకలు సాగించాడనిఒక కథ. నిజమెంతో, అబద్ధమెంతో తెలియదు కాని, నిజమయితే బాగుండునని ఒక ఆశ.ఎందుకంటే ఒక పుస్తకము, మస్తకములోని బూజును దులిపిందంటే గర్వ కారణమే కదా !

జలజాతాసన వాసవాది సుర పూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామ పాదంబునం
దొలగం ద్రోచెలతాంగి , యట్ల యగు నాథుల్ నేరముల్ సేయ బే
రలుకం జెందిన యట్టి కాంతలుచితవ్యాపారముల్ నేర్తురే.(1-121)

సముచిత పద ప్రయోగము, అలంకారము పరిణతి చెందిన కవి కలములో పోటీపడ్డాయి

తనకు మొక్కుతున్న కృష్ణుని కాలితో తన్నింది సత్యభామ.ఈ వాక్యమే వ్రాసిఉంటే ఈ పద్యము , ప్రబంధము గొప్పవయ్యేవి కావు.బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలందరిపూజలందుకొనేది కృష్ణుని తల అనటంతో సాధారణమైన తలకు మించిన గౌరవము వచ్చింది. పూలు ఆయుధముగా కలిగిన మన్మథుని కన్నతండ్రి అని చెప్పటంతో ఆయన సుకుమారుడని చెప్పక చెప్పినట్లయినది.

తన్నింది కుడి కాలితో కాదు. ఎడమ కాలితో అనటంతో సత్యభామ కోపము యొక్క తీవ్రత తెలిపినట్లయింది.''అంతే నయ్యా ! మొగుళ్లు నేరాలు చేస్తే పెళ్లాలు ఊరుకొంటారా ! ఆయనగారి మీదే పెట్టుకొన్న ప్రేమ బద్దలయిందని తెలిసినప్పుడు ఏమైనా చేస్తారు. ఇది చేయాలి.ఇది చేయ కూడదని వాళ్లకు తెలియదు అని అర్థాంతరన్యాసములో చక్కగాచెప్పాడు.

శ్రీజయదేవకవి గీతగోవిందములో ''స్మరగరల ఖండనం మమ శిరసి మండనం దేహి పదపల్లవముదారమ్ |
జ్వలతి మయి దారుణో మదనకదనా2నలో హరతు తదుపహిత వికారమ్'' అంటూ నాయిక కాళ్లను తన నెత్తి మీద పెట్టమన్నాడు.ముక్కు తిమ్మన ఏకంగా కాళ్లతో తన్నించాడు.

''లోకమునం గల కవులకు

నీ కవనపు టీవి యబ్బునే కూపనట

ద్భేకములకు గగనధునీ

శీకరముల చెమ్మ నంది సింగయతిమ్మా! అనేదాంట్లో కొంత అతిశయోక్తి ఉన్నా అప్పుడప్పుడు నిజమేమో అనిపిస్తుంది పారిజాతాపహరణము చదువుతుంటే .

"రుక్మిణి తేజరిల్లె సానబట్టిన మకరాంకుశస్త్రమనగ" అంటు చెలికత్తె సత్యభామతో చెబుతుంది.సత్యభామకు తాను మహా సౌందర్యవతిని అన్న నమ్మకము. ఈ నమ్మకము మీద చెలికత్తె దెబ్బకొట్టింది.సానబట్టిన మన్మథుని బాణములా రుక్మిణి ఉందంటేసత్యభామ ప్రాణము జిలార్చుకుపోతుంది.అసలైన రోషపు కథ మొదలవుతుంది.

ఓర్వోకయింత లేని వికచోత్పలలోచన చిత్తవీథిం జ

ల్లార్పగ నీలనీరదశుభాంగుడు వేఁసనుదెంచె నంచుఁ గం

దర్ప హుతాశనున్వెలికిఁ దార్చు సఖుండును బోలె వేడి ని

ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంతమై

- సత్యభామ మనస్సులో కోపమనే అగ్ని మండిపోతోంది.దానిని చల్లార్చడానికి వాన కురవటానికి సిద్ధంగా ఉన్న నల్లటి మబ్బులా ఉన్న కృష్ణుడు వస్తున్నాడు, ఇక' ఓ కోపాగ్ని ! బైటికి పద' అని గాలికి చెబుతున్నట్టుగా కప్పుకున్న ముసుగుని తోసుకుంటూ సత్యభామ వేడి నిట్టూర్పు బయటికి వస్తోందట.చక్కటి వర్ణన.

పూనుకొని మేలు గీళ్ళకు /

లోనయి విహరించువారి లోక మెఱుగదో!/

యా నరకాసుర దమనుఁడు/

తానెరుగడో! భోజ కన్య తానెరుగదొకో(1-91)

నరకాసుర దమనుడు అనే పదాన్ని ముక్కు తిమ్మన ఎంతో సొగసుగా సత్యభామ చేత అనిపించాడు.

బాధతో మాట్లాడుతున్నప్పుడు తెలుగు వారి నోట పాత కథలు దొర్లుకు వస్తుంటాయి. నరకాసురుని చంపే సమయంలో ఆ కృష్ణునికి ఎంత మేలు చేసాను! నిజానికి నరకుని చంపింది నేను. కాని నరకాసురుని చంపిన వానిగా పేరు తెచుకొన్నవాడు కృష్ణుడు.నాకు రావాలిసిన పేరును తాను ఆయాచితంగా కొట్టేసాడు. పోనీలే భర్త కదా అని ఊరుకొన్నాను. కని భర్త చేయవలసిన ధర్మము ఇప్పుడు చేయకుండా ఆ

పారిజాతము రుక్మిణికి ఇస్తాడా ! అని సత్య భామ ఆవేదన. ఇవన్నీ ఒక్క నరకాసుర దమన శబ్దములో తిమ్మన ఇమిడ్చాడు.

శృంగార రసమా ! బంగారపు రసమా ! అనేది కాసేపు పక్కన పెడదాము. అద్భుతమైన భావము. ఇటువంటి భావాలున్న ప్రబంధాలను చాచి తంతే – సాహిత్యంలో ఒక శూన్యము ఏర్పడుతుంది. ఇటువంటి సరియైన పద ప్రయోగాలను చదివి ఆనందించటానికి ఆధునికులు ప్రాచీన ప్రబంధాలు చదవాలి.

## కళాపూర్ణోదయం

''కతరాజు'' గా పింగళి సూరనకి మంచి పేరుంది. సూరన రచించిన “కళాపూర్ణోదయం తెలుగు సాహిత్యంలో అపూర్వ కథా రచన. కథని కల్పించటములో ఇతనికున్న ప్రతిభ చాలా గొప్పది.

ఆ ఊరి పేరు ద్వారకానగరం! ఆ ఊళ్ళో అద్భుతమైన సౌందర్యవతి కలభాషిణి!

ఓ తోటకి స్నేహితురాళ్లతో విహారానికి వెళ్ళింది ఉయ్యాలలు ఎక్కారు. ఆసమయంలో ఆకాశంలో విహరిస్తున్న మణికంధరుడుఅనే కవి తన గురువు గారైన నారదునితో ఇలా అన్నాడు.

తమిబూదీగెల తూగుటుయ్యెలలబంతాలాడుచుందూగునా
గోమరుంబ్రాయపు గబ్బిగుబ్బెతలయంఘ్రుల్ జక్కగ జాగి మిం

**టి మొగంబై జనుదెంచురీవిగనుగొంటే దివ్య మౌనీంద్రనా**

**కమృగీనేత్రల మీద గయ్యమునకుంగాల్ సాచు లాగొప్పెడిన్(1-147)**

మునీంద్రా ! ఈ అమ్మాయిల పాదాలు చూశారా! స్వర్గంలో ఉన్న దేవతాస్త్రీల మీద ''కయ్యానికి కాలు దువ్వుతున్నట్లు'' ఉంది అన్నాడు వీళ్ళ వ్యవహారం చూస్తుంటే!'' కేవలము కయ్యానికే కాదు, వాళ్ళ ''తల దన్నటానికే'' ఆ పాదాలు వెళ్తున్నాయని గురువుగారు పిసరంత కవిత్వపు సరుకును పెంచారు.

కవిత్వంలో కాలుదువ్వి, తలదన్నే భావనలివి.

కలభాషిణి, సుగాత్రి, శాలీనుడు, మణిస్తంభుడు, మధుర లాలస మొదలైన పేర్లు పెట్టడములోనే సూరన కల్పనాశక్తి తెలుస్తుంది..కవిత్వమనేది ఎలా ఉండాలో, సుకవి కవిత్వము ఎలా ఉంటుందో చెప్పిన ఈ పద్యము చాల ప్రసిద్ధమైనది.

**''చలువ గల వెన్నెలలు చెలువునకు సౌరభముగలిగినను, సౌరభము**

**జలువయు దలిర్పం,బొలుపెసగు కప్పురపు పలుకులకు గోమలతనెలకొనిన,**

**సౌరభము జలువ పసయుం, గోమలతయును గలిగి జనముల మిగుల పెంపె**

**సగుమలయ పవనంపు గొదమలకు మధురత్వం,బలవడిన నీడుమరి గలద**

నగ వచ్చు గడు వెలయగల ఈ సుకవి పలుకులకు నెంచన్ (కళా.ఆ,1, ప.187.)"

ఈ పద్యము చదివిన కట్టమంచి రామలింగారెడ్డిగారికి పరవశత్వంతో మాటలు ఇలా దొర్లాయి.

కల్పనా సామర్ధ్యమీ కవికి వలె నాంధ్రులలో మరెవ్వరికి గానము...... ప్రబంధ కవులన్ననో గొర్రెల మంద రీతి ఒకరు పోయిన దారినే తలవంచుకొని అందరును పోయిరి గాని , స్వేచ్ఛా గమనము దాల్పరైరి. సూరనార్యుని యందు ప్రబంధ కవులకు గల వర్ణనా శక్తి తోడ కథా కల్పనా శక్తియు, వివిధములైన సంధర్భములను సంధానమునకు తెచ్చు ప్రతిభయు, సహవాసములు. మరియు భావనా శక్తి తోడ భాషా శక్తియు గలవాడగుట దానె సర్వకవితాలక్షణ సంపన్నుడనం జెల్లు గాదె? కవిత్వము భవ్యంగుటకు భావము భాష రెండును కలసి మెరయవలయుట నిత్య సమయము. సూరనార్యుడీ రహస్యమెరిగిన వాడనుటకు నిదర్శనమేమనగా: కవితా స్వరూపమును ప్రభావమును తా వర్ణించి వ్రాసిన పై పద్యము.

భావము శైలిని మించినదా, శైలి భావమును మించినదా యని వెరగొనరించు నగ్ర గణ్య పద్యములలో నిది యొకటి! కవిత్వ ప్రశంసల నెన్నియో చూచి యున్నాను గాని మనోహరములైన ఇన్ని యాకృతులను ఎదుర నిల్పి మైమరచునట్లు చేయుమాటల నింకెయ్యడను కనలేదు, వినలేదు! ఊహ నుండి ఊహకుగా

భావము మీది కెగయుచు, దుదకు కంటికి గనరానియంత ఔన్నత్యమును వహించినది గదా!"(కవిత్వ తత్త్వ విచారము , 70,71వపేజీలు ఆంధ్ర విశ్వ కళాపరిషత్ ప్రకటితము 1973)

నిస్సందేహముగా ఇది మంచి పద్యమే కాని, వీడు గొప్ప అని చెప్పుటకు ఇతరులను తక్కువ చేయనక్కరలేదు. సూరన తప్పించి మిగతా ప్రబంధకవులందరూ గొర్రెల మంద కారు.ఏ కొద్ది మందో అనుకరణ సమ్రాట్టులు ఉండవచ్చు. అంత మాత్రమున ప్రబంధ కవులందరూ గొర్రెల మంద బాపతు కారు.

కళా 'పోర్నో'దయమ్ అనే పేరు మీద ఆంధ్ర జ్యోతి వివిధలో ఒక వ్యాసం వచ్చింది.(జూన్ 28 సోమవారం 2010).పోర్నోగ్రఫీ అంటే బూతు సాహిత్యము. కళాపూర్ణోదయము అటువంటిదని, బోధనకు పనికి రాదని మొత్తము మీద ఆ వ్యాస సారాంశము.

కళాపూర్ణోదయములోని శృంగార ఘట్టాలు కథతో అనుసంధానించబడ్డాయి. అక్కడ ఆశృంగార వర్ణన లేకపోతే కథ ముందుకు నడవదు. కథ ఏమిటో తెలియదు.ఉదయిస్తున్న సూర్యుడికి పక్కగ ఒక తెల్లటి మేఘం కనపడితే రంభ అవి రెండూ బ్రహ్మ సరస్వతుల్లాగా ఉన్నాయని నలకూబరునితో చెప్పింది. అ నలకూబరుడు ఆమెని ముద్దాడి ఆమె పెదవులను పంటితో నొక్కాడు. అప్పుడు రంభ గొంతులోనుంచి

ఇదివరకెప్పుడూ నలకూబరుడు వినని ఒక మృదువైన శబ్దం వచ్చింది. ఇక్కడ శబ్దము కథకు ప్రాణమైనది. అందుకే హద్దు మీరిన శృంగార వర్ణన.

శాలీనుడు సుగాత్రి చెంపల చెమటని తన ఉత్తరీయంతో తుడుస్తుంటే ఆ చెమట అలా వస్తూనే అందట. కారణము అది మన్మథుడి మహిమ అని చాలా సున్నితంగా సూరన శృంగార రసవిష్కరణము చేస్తాడు..సతిన్ మదన మహారాజ్య భోగ మహిమన్ తేర్చెన్ (04-100)అంటూ కథకు అవసరమైన సంభోగ శృంగారాన్ని సభ్యతగా ఒకే ఒక్క వాక్యంలో కవి చెప్పాడు. ఇది హద్దులు మీరని శృంగార వర్ణన.

వదనములు నాలుగింటికి వరుస గలియ

మెలపుతో దన కంఠంబు మలచి మలచి

యొసగె దదధరపాన మహోత్సవంబు

గళము కౌగిలితోన చెక్కులు నిమురుచు (5-26)

సరస్వతిని బ్రహ్మ కౌగిలించుకుని తన నాలుగు ముఖాల్తో ముద్దు పెట్టాడు..అందులో ఒక ముద్దు కొంచెం గట్టిగా నాటింది.! కోపంతో బ్రహ్మ నాలుగు ముఖాల్ని తన రెండు చేతుల్తోనూ సరస్వతి వెనక్కి నెట్టింది! ఆ

రకమైన స్థితిలో కనీ కనబడకుండా ఉన్న ఆమె పాలిండ్లనీ , ఆమె సన్నటి నడుమునీ బ్రహ్మ అలాగే కొంతసేపు చూసి మళ్లీ ఆమెను ముద్దాడాడు!

ఈ శృంగార వర్ణనలో కథ ప్రతీకాత్మకముగా ఉంటుంది. పైకి శృంగారము. లోపల కథ. ఒక బ్రహ్మ మోము గట్టిగా పీడించటం అంటే పురోహితు డొకడు మణిని గట్టిగా నొక్కటానికి సూచన. ఆ రకమైన స్థితిలో కనీ కనబడకుండా ఉన్న ఆమె పాలిండ్లనీ , ఆమె సన్నటి నడుమునీ అలాగే కొంతసేపు చూడటమంటే కథలోని మదాశయుడు భార్యతో కలిసి కళాపూర్ణుడిని వదిలి అంగదేశంలోనే మరో చోటికి వెళ్ళటం అంగ దేశంలో రెండు పూర్ణ కలశాల్ని చూసి మధ్య దేశంలో కొంత కాలం మదాలసుడు ఉంటాడు. దీనినే స్తనాలను చూసి నడుం దగ్గర కొద్దిసేపు బ్రహ్మ దృష్టి నిలపటంగా వర్ణించుట జరిగింది.తన శృంగార వర్ణనలో ఈ ప్రతీకాత్మకత ఉందని కవి స్వయంగా సరస్వతీ ముఖంగా చెప్పించాడు. కనుక ప్రబంధాల్లోని ఈ శృంగార వర్ణనల వెనుక అంతరార్థాన్ని అర్థం చేసుకోవాలి .

కావ్యాల్లో బూతుకు, శృంగారానికి మధ్య చిన్నపాటి గీత వుంటుంది. ఆ గీత పరిధి తెలియని వారికి శృంగారము బదులు బూతు ఎక్కువగా కనిపిస్తోంది. శృంగారం కళ. దానికి కవిత్వ స్థాయిని అందించింది ప్రబంధము. ఎక్కడ వర్ణన మోతాదు మించుతోందో అక్కడ ఆపినా, గడుసుదనంతో అసభ్యతని మరిపించినా

శృంగారానికి ఒక సామాజిక గౌరవం వస్తుంది.కళాపూర్ణోదయములాంటి ప్రబంధాల్లో ఇటువంటి సామాజిక గౌరవము ఉంది.అలా అని అన్ని ప్రబంధాల్లోను ఈ శృంగారము గీత దాటలేదని ఖచ్చితముగా చెప్పలేము.

కవికున్న సంస్కారము, రచనలోను , పాఠకుని మనస్సు లోను ప్రవేశిస్తుంది. ప్రాచీన ప్రబంధ సాహిత్యాన్ని ఒక సాంస్కృతిక సంపద గా గుర్తిస్తే దానిపట్ల నిరసన రాదు. అప్పటి భోగ సమాజ నేపథ్యంలో వెలువడిన ప్రబంధాన్ని బోధించేటప్పుడు ఆనాటి సామాజిక అంశాలను, ఇప్పటి సామాజిక అంశాలను కలగలుపుతూ భావ సౌందర్యాలను, అర్థ సౌందర్యాలను బోధిస్తే వినే విద్యార్థులకు మన ప్రబంధాల మీద గౌరవం వస్తుంది.

ప్రాచీన సాహిత్యంలో చంద్రకాంతి తప్ప సూర్యకాంతి లేదని ఒక మాట ఉంది. అది తప్పని కళాపూర్ణోదయంనిరూపిస్తుంది. దీనిని మొదటి నవలగా చెబుతారు. నారాయణ రావు, షుల్మన్ గార్లు కళాపూర్ణోదయాన్ని దక్షిణాసియాలో వచ్చిన తొలి నవలగా నిరూపిస్తారు ది సౌండె ఆఫ్ ది కిస్ అన్న గ్రంథంలో. ఒక నవలకుండవలసిన లక్షణాలు స్పష్టంగా ఇందులో ఉన్నట్టు చూపిస్తారు.

జీవితంలాగే కళాపూర్ణోదయం వెంటనే అర్థం కాదు. అర్థం స్ఫురించినా అంతరార్థం అవగాహన చేసుకోవటానికి చాలా వ్యవధి పడుతుంది. అయితే ఉత్త కథమాత్రమే కావలసిన వాళ్లకు సైతం ఈ కావ్యం

కమ్మని విందు చేస్తుంది అన్నాడు ఆరుద్ర –(వైజాసత్య జూన్ 2007 )శల్యాసురుడనే రాక్షసుని ఒక ప్రేమికునిగా కళాపూర్ణోదయము చేసింది. ఇది ఇందులోని ఆధునికత.

## శ్రీకాళహస్తి మాహాత్మ్యము

ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యము శ్రీకాళహస్తి క్షేత్రం లోని ఈశ్వరుని లీలలూ, ఆయన భక్తుల కథలూ తెలిపే గ్రంథం. శ్రీకాళహస్తికి ఆ పేరు రావడానికి కారణాలైన , పామూ, ఏనుగుల శివభక్తి కథలతో పాటు , తిన్నడూ మరి ఇద్దరు వేశ్యా యువతుల శివభక్తి, ఇంకా నత్కీరుడు అనే తమిళదేశపు కవి కథ ఇందులో ఉన్నాయి.చంద్రుని, శివలింగముతో పోలుస్తూ చేసిన మనోహరమైన కవి వర్ణన ఇది.

మ. ఉదయ గ్రావము పానవట్ట, మభిషేకోద ప్రవాహంబు వా
    ర్ధి, ధరధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీప ప్రభారాజి కౌ
    ముది, తారానివహంబు లర్పిత సుమంబుల్గా దమోదూర సౌ
    ఖ్యదమై శీత గభస్తి బింబ శివలింగం బొప్పె బ్రాచీదిశన్

చంద్రుడు ఉదయించిన ఉదయశైలం పానవట్టము. అభిషేకము చేసిన తర్వాత వచ్చే ప్రవాహము తూర్పు సముద్రము.సముద్రపు గట్టు మీద ఉండే మసక చీకటి ధూపము. . వెన్నెల పూజలో వెలిగించే వెలుతురు. నక్షత్రాలు శివుని పూజా కుసుమాలు. ఈ విధంగా చంద్రుని, శివుని ఒకే రకంగా భావించాడు ధూర్జటి.

తిట్టడంలో కూడా కమ్మగా తిట్టించటం ప్రబంధాల్లో సాధ్యము. ఏనుగు తన పూజా ద్రవ్యాలు తీసేసిన తర్వాత శివుడిని పట్టుకొని ఇలా తిడుతోంది.

**ఉనికి శిలోచ్చయంబు; నిజయోష శిలోచ్చయ రాజ పుత్రి; నీ**
**ధనువు శిలోచ్చయంబు; పురదాహ! రథీకృత రత్నగర్భ! నీ**
**మనమునకీ శిలా శకల మండన మెట్లు ప్రియంబు సేసె? నే**
**మనగల వాద నిన్ను వ్రత హాని యొనర్చు దురాత్ముడుండగన్**

ఉండేది బండలున్న కొండ. కట్టుకొన్నది కొండల కుమార్తె.(పార్వతి) ధనుస్సు రాళ్ల సమూహము(పినాకము). నువ్వేమో పురాలను దహించినవాడివి.రాళ్ల మరో స్వరూపమైన రత్నాలున్న భూమి. నీ మనస్సుకి ఈ రాళ్ల అలంకారము ఎలా అనందాన్ని ఇచ్చింది స్వామి?అయినా నిన్ను నేను ఏమని అనగలను.

చక్కటి ఎత్తిపొడుపు.

తూర్పుదిక్కు అనే కాంత విసరగా, పశ్చిమదిక్కు అనే కాంత పట్టుకున్న ఎఱ్ఱని బంతిగా అస్తమించబోతున్న సూర్యుని అందంగావర్ణించాడు ధూర్జటి.(ప్రాగ్వధూమణి చిమ్మఁ బశ్చిమదిక్కాంత పట్టిన చెంగల్వబంతి యనగ)

నత్కీరుని కథలో మానవ సంభాషణల్లో ప్రతిపాదన, ప్రతిభాషణల మధ్య తేడా వస్తే జరిగే అనర్థాన్ని వివరించాడు కవి.స్త్రీ కేశపాశము సహజమైన వాసనతో ఉందదని నత్కీరుని ప్రతిపాదన. కాని వాదనకు శివుడు వచ్చాడు. నేను చెబుతున్నానయ్య! నా భార్య పార్వతి కేశపాశము సహజమైన వాసనతో ఉంటుంది అని చెప్పినప్పుడు, నత్కీరుడు తన ప్రతిపాదనను సవరించుకొని ఉందవలసినది. దేవతాస్త్రీల కేశ పాశాలు సహజమైన వాసనతో ఉంటాయి, మానవస్త్రీలవి ఉండవని. కాని తొందరపడి తల చుట్టువాఱ గన్నులు/గలిగిన బద్యంబు దప్పు గాదన వశమే/వలదిచ్చట నీ మాయా/విలసనములు పనికి రావు విడువు" మన్నాడు. ఫలితంగాకుష్ఠ వ్యాధి శాపము పొందాడు. అందుకేఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు తమ పద్య కవితా పరిచయములో "నత్కీరుడి ప్రతిపాదనలో దోషం లేదు కానీ, ప్రతిభాషణలో దోషం ఉంది. అహంకారం ఉంది. సామాన్యుల అహంకారంవల్ల సమాజానికి కీడు ఆట్టే ఉండదు. కానీ నత్కీరుడిలాంటి మహోన్నతులకు ఇంత అహంకారం ఉంటే లోకానికి కీడు కూడా మహోద్ధృతంగానే ఉంటుంది. అందుకని

కాబోలు తీవ్రమైన శాపమే పొందాడు" "అన్నారు. ఇదే శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్య ప్రబంధ ముఖ్య సందేశము.

## ఆముక్తమాల్యద

కవిత్వంలో రెండు లక్షణాలుంటాయని, మొదటిది శబ్దం, కూర్పు, బిగింపు, గడుసుదనము, పలుకుబడి కలిగి ఉంటే, రెండవ దానిలో భావము, కల్పన, అలంకారములు, కథన శైలి ముఖ్యమయినవి. ఆముక్తమాల్యద 'ఈ రెండు మార్గములలోను దానికదే సాటి' అని విశ్వనాధ సత్యనారాయణగారి విశ్లేషణ.

అయిదు మూడు రెండు ఆముక్తమాల్యద అని శ్రీశ్రీ ఆముక్త మాల్యదకు నమస్కరించాడు. (5+3+2=10 పది వేళ్లు కలిస్తే నమస్కారము)

ఆముక్తమాల్యద చాలా.అందమైన భావాలూ, వర్ణనలూ పుష్కలంగా వున్న ప్రబంధం. శ్రీవిల్లిపుత్తూరు దేవాలయ పూజారి విష్ణు చిత్తుల వారి కూతురు ఆండాళ్ శ్రీరంగం లోని రంగనాధ స్వామిని పెండ్లి చేసుకొనుట ఇందులోని ప్రధాన కథ. మాకు ఇష్టంగా ఓ కావ్యము నిర్మించు. శ్రీరంగంలో తను ముందుగా ధరించి ఆ తరువాత పూల దండల్ని నాకిచ్చిన వయ్యారిని నేను వివాహము చేసుకున్నాను. నువ్వు ఆ

పెండ్లికథను చెప్పు.''అని ఆంధ్ర మహావిష్ణువు రాయలవారిని అడిగీ మరీ వ్రాయించుకొన్న కావ్యము ఆముక్తమాల్యద.

మాల దాసరి కథ, ఖాండిక్య కేశిధ్వజుల కథ, యమునాచార్యుని కథ మొదలైన చిన్న కథలూ కూడా ఇందులో ఉన్నాయి.ఈ ప్రబంధంలో రాయల వర్ణనలు కథల కంటె చాల ప్రసిద్ధి పొందాయి.

**గరుత్మంతుని వర్ణన**

గరుత్మంతుని రెక్కల గాలి చేత సముద్రములోని నీళ్లన్ని ఒక్క చుక్క మిగలకుండా ఆకాశానికి ఎగిరిపోయాయట.అప్పుడు పాతాళము బయటికి కనబడింది. అందులో ఉండే పాములన్నీ , తమకు గరుత్మంతుడు శత్రువగుట చేత భయ పడిపోయిఒకదానికొకటి కరచుకొని ముద్దలుగా అణగిపోయాయి.

(ఖనటత్పయోధి వీక్ష్య రసాతలాన్యోన్య పిండీకృతాంగ భీతాండజములు(1-3)

తలబక్షచ్చట గ్రుచ్చి బాతువులు కేదారంపుగుల్యాంతర

స్థలి నిద్రింపఁగజూచి యారెకు లుష స్స్నాతప్రయాతద్విజా

వలి పిండీకృత శాటులన్నవి దదావాసంబుజేర్పంగ రే

వుల డిగ్గ న్వెస బాఋువానిఁ గని నవ్వు న్నాలిగోప్యోఘముల్

పొలాల్లో వరిమళ్లకు కాలువలు తీసారు. ఆ కాలువల మధ్య ఉదయ సమయంలో బాతులు తమ రెక్కల సందుల్లో తలలు దూర్చి నిద్ర పోతున్నాయి. ఆ ఊరి కాపలావాళ్లు అలా ఉన్న బాతులను చూసి "తెల్లవారుజామున స్నానానికి వచ్చిన బ్రాహ్మణులు తమ బట్టలని నీళ్లలో ముంచి పిండి ఆ తడి ముద్దల్ని అక్కడ మర్చిపోయి ఇంటికి పోయారు" అని అనుకొన్నారట. పరోపకార బుద్ధితో అ అబట్టలని ఆ బ్రాహ్మణుల ఇళ్లకు చేర్చడానికి రేవులో దిగారు. ఆ శబ్దానికి గబుక్కున లేచిపోయి బాతులు వేగంగా పరుగెత్తాయి. ఇది చూసి వరిపంటకు కాపలాగా ఉన్న స్త్రీలందరూ నవ్వుతున్నారట.

ఒక అందమైన భావన మీద ఇంకో భావన. బాతులను పిండిన గుడ్డలుగా భావించటం ఒక అందమైన భావన. భ్రమతో వాటిని తీసుకోవటానికి దిగుతున్న మగవారిని చూసి, స్త్రీలు నవ్వుతున్న సన్ని వేశము ఇంకొక అందమైన భావన.

అప్పటికీ, ఇప్పటికీ మానవుల మనస్తత్వాలు మారలేదు. మానవుల మనస్తత్వాలను బాగా పట్టుకొన్న రాయలు చేసిన ఒక అమోఘమైన వర్ణన ఇది.

వేసవికాలము. ఎండలు మండుతున్నాయి.బాట సారులకు నీళ్లు పోయటానికి చలిపందిళ్లలో స్త్రీలు ఉన్నారు.బాటసారులుమొదట దాహంతో అమ్మ, అక్క అని పిలిచారట ఆ స్త్రీలను. నీటి దాహం తీరిన తర్వాత

ఆ బాట సారుల మనస్సులో ఇంకో దాహము మొదలయింది. నీళ్లు పోసిన ఆస్త్రీల ముఖాలు , అవయవ సంపదమొదలైన వాటిని తేరిపార చూడటం మొదలుపెట్టారు.వీళ్ల చేష్టలలో వచ్చిన తేడాను చూసి, ఆ స్త్రీలు నవ్వుతున్నారు. వంకర తిరిగిన మానవ మనస్తత్వాన్ని చూసి , పుట్టే నవ్వు అది.(తొడిబడనమ్మయక్కయని తూలుచు దీనత .......నగిరి కొందరు పాంథుబ్రపాపాలికల్)

నృపుల పద హలరేఖలకెల్ల మా భుజాగ్ర హలరేఖలే మూలమనుచు (2-27)తాము నాగేలు పట్టుకొని దున్నటము చేతే కదా ఈ రాచరికపు వైభోగాలని పొలాలు పండించే కాపులు భావిస్తారు. సంపదను పండించే వారే సంపదను అనుభవించే రాజులకి మూలమనే సత్యాన్ని రాయలు ఈ వర్ణనలో పేర్కొన్నాడు.

మత్స్యధ్వజుడు అనే రాజులో వైరాగ్యం కలిగింది!. ఆ తర్వాత సభలో మోక్షాన్ని ఇచ్చే భగవంతుడు ఎవరో తేల్చి చెప్పండి అని చర్చ మొదలుపెట్టాడు.

వాద మొనరించి గెలిచి తత్త్వంబు దెలుపు
వాని కని బీరపువ్వుల బోని టంక
సాల వాటులు నించి యాస్థాని గట్ట
గాల సర్పము గతి వ్రేలు జాలె జూచి(2-76)

వాదంలో ఎవడు గెలుస్తాడో ఆ పండితుని కొరకు బీరపువ్వుల్లాంటి పచ్చని బంగారు నాణాలను నింపిన ఒకసంచిని తన ఆస్థానంలో వేలాడదీసాడట! ఆ నాణేల బరువుకి సాగిందో! మరి నిజంగానే అలా ఉందేమో! తెలియదు కాని -అది ఒక విషము గక్కే తాచు పాములా చూసేవాళ్లకి ఆ సంచీ కనబడుతోంది.

పోలిక మీద పోలికలో ఆ ఏలిక రాయలు మెదడును ఝల్లుమనిపిస్తాడు. అసలు ఆయన ప్రకృతి పరిశీలనా దృష్టికి కిందా మీదయిపోతాము.తాచుపాము అందంగానే ఉంటుంది. (భయద సౌందర్యము) ఏమరచి ఉంటే కాటు వేస్తుంది. డబ్బు కూడా అలాంటిదే. ఈ సందేశాన్ని రాయలు అద్భుతంగా ఈ పోలికలో చెప్పాడు.

ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బు శిఖి యబ్బెనేనింటిలో బూరి యిడి విసరక
రాజదు! రాజిన రవులు, కొల్పాసలె గాని కల్గదు కూడు, దాన గలిగె
నేని కూరగుట మందైన బెన్పొగ సుఖభుక్తి సేకూరదు !..' (4-127)అంటూ ఆనాటి సామాన్యుల స్థితిని రాయలు అక్షరీకరించాడు.

వానాకాలంలో వంట వండుకోవటానికి నిప్పుల కోసం ఇల్లిల్లు తిరిగేవారు. ఒకవేళ నిప్పు దొరికినా ఇంటికి తెచ్చిన తర్వాత రాజుకొనేది కాదు.రాజుకొన్న ఆశలే రగులుకుంటాయి కాని కాని మంటలు రగులు

కోవు. అన్నమైనప్పటికీ కూర దొరకదు. ఒకవేళ ఇవన్నీ సమకూరినా పొగతో సుఖంగా భోజనము చేయటానికి వీలు కుదరదు" అంటూ రాయలవారు స్త్రీల ఇబ్బందులను అక్షరీకరించారు.అసలు ఆ మహానుభావుడు ఎప్పుడు రాజ్య పరిపాలన చేసాడు. ఎప్పుడు సామాన్యులను తన ఊహల్లోకి ఇంకింపచేసుకొన్నాడు. తలుచుకొన్నకొద్దీ ఆశ్చర్యము. నాటి ప్రబంధాలలో సామాజిక దృక్పథము ఎక్కడండీ? అని అడిగేవారికి ఇదుగో సామాన్యుని గొంతు అని జవాబు చెప్పే వీలు రాయల వర్ణనలలో లభ్యమవుతుంది.

నల్లగ్రోల నిచ్చి మెల్లన చివ్వంగి
నోటి జింక దివియు నేరుపొదవు
వేటకాడు వోలె విషయాళి వలన ద
త్తృష్ణ దీరనిచ్చి త్రిప్పుటొప్పు(4-194)

విషయ వాంఛలలో మునిగిన వానికి ఒక్కసారిగా వేదాంతము చెప్పకూడదట.దానికి ఎవరు చెప్పని ఒక అందమైన పోలిక రాయలు చెబుతున్నాడు.పులి నోటిలో ఒక జింక చిక్కుకొని ఉంది. జింక నెత్తురు కొంచెం తాగిన తరువాత , వేటగాడు పులినోటిలోనుంచి లేడిని గబుక్కున లాగేస్తాడు. అసలు కొంచెం కూడా నెత్తురు తాగనివ్వకపోతే పులి వేట గాడిని బతకనివ్వదు. కొంచెం నెత్తురు తాగిన తర్వాత ఆ సుఖము

అనుభవించిన తర్వాత జింకను లాగేస్తే ముందున్నంత కోపము పులికి ఉండదట. సుఖాలను కూడా కొంచెం అనుభవించిన తర్వాత , వాటిని దూరం చేయాలి కాని ఏమి అనుభవించకుండా వేదాంతము చెప్పకూడదట.అసలు ఆ పోలికకి జోహారు.శ్రీకృష్ణదేవరాయలు రాసిన అముక్త మాల్యద గ్రంథం తెలుగు భాషకు బనారసు పట్టుచీర, దాని నిండ బంగారపు పువ్వులే. దానికి వెడల్పైన జరీ అంచు గలదు. ఆ యంచే 'మాలదాసరి కథ' అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు. కులముకంటె గుణము గొప్పదని నిరూపించిన కథ ఇది.ఆంగ్లంలోకి ఆముక్తమాల్యద అనువదింపబడింది.(అనువాదకులు శిష్ట్లా శ్రీనివాస్)

**పాండురంగ మాహాత్మ్యము**

క్షేత్రము, వేల్పు, తీర్థము - ఈ మూడింటికి సమానమైన ప్రాధాన్యమున్న క్షేత్రపు కథ పాండురంగ మాహాత్మ్యము.

ఉదయం బస్త నగంబు సేతువు హిమవ్యూహంబునం జుట్టి రా
విదితంబైన మహిన్ మహాంధ్ర కవితా విద్యానల ప్రౌఢి నీ
కెదురేరీ? సరసార్థ బోధఘటనాహేల పరిష్కార శా
రద నీరూపము రామకృష్ణకవిచంద్రా! సాంద్ర కీర్తీశ్వరా!

ఓ రామకృష్ణకవీ! తూర్పు కొండలు, పడమటి కొండలు, దక్షిణ సముద్రము, హిమాలయ పర్వతం – ఈ నాలుగు దిక్కుల మధ్యలో ఉన్న దేశంలో గొప్ప కవితా విద్యలోనీ అంతటి మహాకవి ఇంకొకరు ఎవరూ లేరు. సరసమైన అర్ధబోధతో ఉన్న ఒయ్యారపు నగలు గల సరస్వతీ దేవి నీ రూపము! అని విరూరి వేదాద్రి మంత్రి పాండురంగమాహత్మ్యము అవతారికలో చెప్పాడు.అంటే సరస్వతీదేవి ఇంకొక రూపమే తెనాలి రామకృష్ణుడని భావము.

ఇది అతిశయోక్తి అని ఆధునికులు భావించకూడదు.పాండురంగ మాహాత్మ్యాన్ని సాకల్యంగా చదివిన తరువాత ఇది నిజమేనని అనిపించక మానదు.

కవి తన కత్యంత ప్రీతిపాత్రమైన తుంగభద్రానది నుండి వచ్చే పిల్లతెమ్మెరలెలా ఉన్నాయో వర్ణిస్తున్నాడు.

పంపాతరంగ రింఖణ

ఝుంపా సంపాద్యమాన జలకణరేఖా

సంపాత శీతలానిల

సంపద వొదలించెఁ బరమశైవోత్తంసున్

పంపానది లోని అలలయొక్క తొట్రుపాటులతో కూడిన దూకుళ్ళతో సంపాదింపబడిన నీటి తుంపరల సమూహము పడటం వల్ల చల్లగా ఉన్న గాలి ఆ శివభక్తులలో గొప్పవాడైన ఆ అగస్త్యమహర్షిని సంతోషపెట్టిందని భావము. ఈ భావాన్ని సున్నాతో పాటు వచ్చే అక్షరాల్లో చెప్పటం వల్ల నీటి తుంపరలతో కూడిన చల్లటి గాలి ఒంటికి తాకుతున్న అనుభూతి వస్తుంది. ఇటువంటి మధురమైన అనుభూతుల కోసం ప్రాచీన ప్రబంధాలు చదవాలి.

ఉపనది అయిన తుంగభద్రా నది గొప్పతనాన్ని కవి చెప్పదలుచుకొన్నాడు. దానిలోని లోపమేమిటంటే అది సముద్రంలో కలవదు. అయినా అది గొప్పదని రామకృష్ణుడు చెబుతున్నాడు.

గంగా సంగమమిచ్చగించునె? మదిన్ గావేరిఁ దేవేరిగా
నంగీకారమొనర్చునే? యమునతోనానందముం బొందునే?
రంగత్తుంగ తరంగ హస్తములతో రత్నాకరేంద్రుండు నీ
యంగంబంటి సుఖించునేని గుణభద్రా తుంగభద్రా నదీ!

ఓ తుంగభద్రా! ఆ సముద్రుని దృష్టిలో నువ్వెప్పుడు పడలేదు. ఒక వేళ నిన్ను చూసి ఉంటే, గంగా, కావేరి, యమున మొదలైన నదులతో అతడు సుఖించేవాడు కాడని కవి తీర్మానము. “వాడుంటేనా ! వీళ్లని అసలు

పట్టించుకొనే వాడు కాదు" అను తెలుగు వారి అందమైన పలుకుబడిని కవిఅందంగా వాడుకొన్నాడు. ఇక్కడ ఇంకొక అర్థము కూడా ఉందని చెబుతారు.మనుచరిత్ర గంగానదికి నిలయమైన హిమాలయాల్లోమొదలయింది. పారిజాతాపహరణము యమునానది తీరాన,అలాగే ఆముక్తమాల్యద కథ కావేరీతీరాన, పాండురంగమాహాత్మ్యకథ తుంగభద్రానదీ తీరాన చోటుచేసుకున్నాయి. సముద్రము లాంటి ఆ రాయలు తాను వ్రాసిన పాండురంగమాహాత్మ్యం స్వీకరిస్తే -మనుచరిత్రను, ఆముక్తమాల్యదను, పారిజాతాపహరణాన్ని,లెక్కచేసేవాడు కాడు. తన కావ్యము అన్నింటికంటె గొప్పదనే కవి బాధ ఇందులో ధ్వనిస్తోంది. కనుక ప్రబంధాల శృంగార వర్ణనలలో కొన్నింటిలో అంతరార్థాలు ఉంటాయి. వాటిని తరచి చూసుకోవాలి.నదులను కాలపురుషుని కుమార్తెలుగా భావించి సముద్రునికి పెళ్లి చేయించాడు హంస వింశతి ప్రబంధ కర్త అయ్యలరాజు నారాయణా మాత్యుడు.( **వృష్టి గజరాజగామినీ విభుడు సమయ/పురుషుఁడయ్యెడ నిమ్నగా పుత్రికలను**

**గాంచి పెంచి ప్రమోదంబు గడలు కొనగ/బరిణయమొనర్చె శరధికి భవశరధికి***హంసవింశతి ఆ. 5. పద్య.62.)*నదులకు, సముద్రానికి మధ్య పతీ పత్నీ సంబంధము ప్రసిద్ధము.

తన భార్య ఎదురుతిరగని బుద్ధితో సాయము చేస్తుంటే పుండరీకుడు తల్లిదండ్రులకు ఇలా సేవలూ చేసేవాడు.

ఆపాదమస్తంబు నంటు నూనియగాచి
స్వయముగా నుద్వర్తనంబొనర్చు
జలకమార్చు నఖంపచ స్వచ్ఛజలముల
గడు మెదుగుడులఁ బొదివి
లఘుధౌత వసనపల్లవములు గట్టించు
శిరసార్చు మృదులీల సురటి విసరి
చేయూఁత యొసఁగి వేంచేయించు లోనికి
ద్వారావతి గలంతి దానె యొసఁగుఁ
దెలుపు సంధ్యా సమాధి విధి ప్రయుక్తి
నగ్ని వేల్పించు విష్ణుసహస్రనామ
పాఠ మొనరించు తటిదోడుపడు గురునకు

గవలు వోకుండబుత్రుడో కలువకంటి.

పుండరీకుడు తన తండ్రికి తానే స్వయంగా నూనెతో అంటి నలుగు పెడతాడు. గోరువెచ్చని స్వచ్ఛమైన నీళ్ళతోస్నానము చేయిస్తాడు. అతిమెత్తని బట్టలతో శరీరాన్ని తుడుస్తాడు. తేలికయిన తెల్లని చిగురుటాకుల్లాటి తండ్రితోకట్టిస్తాడు. మెల్లగా విసనకర్ర తో వీస్తూ తలమీద ఉన్న తడిని ఆరిపోయేట్టు చేస్తాడు. ఇలా అనేక సేవలు చేసేవాడు.వృద్ధాశ్రమాలు ఎక్కువవుతున్న ఈరోజుల్లో అమ్మానాన్న సేవల గొప్పదనాన్ని , చేసే విధానాన్ని ఆవిష్కరించిన పాండురంగ మాహాత్మ్యాన్ని కళ్లకు అద్దుకోవాలి.

చలి చీమనేనియుజాద్రొక్క శంకించు/బలుకఁ డెన్నడు మృషాభాషణములు
కలుషవర్తనులున్న పొలము పొంతజనండు/కలిమికుబ్బడు లేమి కలగఁడాత్మ
దలయెత్తి చూడడెవ్వలనబరస్త్రీలధైర్యంబు విడడెట్టి దద్దఱుటుల
నొరుల సంపదకునై యుపతపింపడు లోన/నిందిం పఁ డెంతటి నీచునైన
మిన్నకయ చూడడాకలి గొన్న కడుపు/సర్వభూతదయోదయోత్సవ మొనర్చు
నిగమ ఘంటా పథైకాధ్వనీన బుద్ధి/బ్రహ్మవిద్యానవద్యుండు బ్రాహ్మణుండు

వేదాలు అనే రాజమార్గములో (నిగమ - ఘంటాపథ) అద్వి తీయంగా ప్రయాణము చేసే బుద్ధిగల వాడు. బ్రహ్మావిద్యయందు పేర్కొనదగినవాడు. ఎక్కడ చనిపోతుం దో అని చలిచీమనికూడా త్రొక్కడానికి సందేహ పడతాడు.

ఎప్పుడూ అబద్ధాలు పలుకడు. పాప చరిత్ర ఉన్నవాళ్లు ఉండే ప్రదేశం దగ్గరికి వెళ్ళడు.సంపదకు పొంగిపోడు దరిద్రానికి మనస్సులో కూడా బాధపడడు. పరస్త్రీలని తల ఎత్తి చూడడు. ఎటువంటి బాధలలోనూ ధైర్యాన్ని కోల్పోడు. పరుల సంపదకి కొంచెం కూడా బాధపడడు. ఎంత నీచుణ్ణి అయినా నిందిం చడు. ఆకలితోనున్న వాడికి తిండి ట్టిపంపిస్తాడు.సమస్త జీవరాశిపై అతనికి దయ పుడుతుం ది. ఈ పద్యంలోని ఉత్తమ మానవ లక్షణాలు ఆధునిక కాలానికి కూడా అనుసరింప దగినవే.

మన ప్రబంధాలల్లోని పాత్రలద్వారా కవులు వ్యంగ్యంగా ఉపదేశాలు చేసారు. మంచి పాత్ర ద్వార మంచి, చెడు పాత్ర ద్వారచెడు గ్రహించి, మంచిని ఆచరించాలి. చెడును విసర్జించాలి. నిగమశర్మ పాత్ర ద్వారా భ్రష్టత్వ పరిణామాలను గుర్తించి, జీవితంలో నిగమశర్మల వలె కాకుండాలి.

చదువు నేర్చుకొనే వారు ఎలా ఉండాలో ఆయుత నియుతుల కథలో కవి ఇలా చెప్పాడు.

**వాసోనిగ్రమెన్నరాఁకలియు నీర్వట్టున్ గణింపర్తలల్**

**మాసెంగా యన రంగముల్ బడలినన్ బాటింపరట్టుండనీ**

**యా సాయంబుగ నానిశాత్యయముగా నామ్నాయముల్ గ్రోల్చుచో**

**నాసీన ప్రచలాయితంబయిన లేదాహా వితర్కింపగన్**

చదువు నేర్చుకొనేటప్పుడు ఆయుతనియుతులుఒంటిమీద బట్టలు ఎలా వున్నాయో చూసుకొనేవారు కారు.ఆకలి, దప్పిక పట్టించుకొనేవారు కారు. జుట్టు పెరిగినా, మాసినా, బడలిక వచ్చినా లెక్క చేసేవారు కారు. ఉదయం నుంచి సాయంకాలం దాకా, రాత్రినుంచి ఉదయం దాకా శ్రద్ధగా కూర్చుని చదివేవారు.కదలికలు , కునికి పాట్లు ఉండేవి కావు.విద్యార్థులకు ఉండవలసిన దీక్షను శారీరక కష్టాలను పట్టించుకోకూడని శ్రద్ధను ఆధునిక తరానికి కూడా ఈ ప్రబంధము ఈ పద్యము ద్వారా నేర్పుతుంది.

ఈ ప్రబంధంలో ఎవరూ మరిచిపోలేని పాత్ర నిగమశర్మ అక్క. “ఈ చల్లని తల్లి పేరేమో తెనాలి రామకృష్ణకవి మనకుఁ దెలుపలేదు. అతనికే తెలియదేమో. వాల్మీకి అగస్త్యునికి పేరు లేని యన్న నొకనిని సృజించెను. అతనికి పేరొక్కటే కాదు, మఱేదియు లేదు. ఈయమ సృష్టి యట్టిది కాదు. రామకృష్ణుఁ డమృతములో లేఖిని నద్ది దిద్ది తీర్చి యాడించిన పుత్తడిబొమ్మ యిది. కావున పేరు లేకున్న నేమి?(రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ)” తెలుగువారి కుటుంబాల్లోని ఒక అక్కని చిరస్మరణీయంగా కవి చిత్రీకరించాడు. ఒక

పుస్తకము చదివేటప్పుడు ఆత్మీయత ఏర్పడితే , ఆ పుస్తకము మీద ప్రేమ పెరుగుతుంది.ఆత్మీయత కలగాలంటే మన ఇళ్లలో ఉండే వ్యక్తి కావ్యంలో పాత్ర అయి ఉండాలి.ప్రబంధాల్లో అటువంటి ఆత్మీయతను పెంచే పాత్రల్లో నిగమశర్మ అక్క ఒకటి.

నిగమ శర్మ అనే తన తమ్ముడు రకరకాలుగా చెడిపోయాడు.వాడికి మంచి చెప్పాలి. వాడితో మాట్లాడేటప్పుడు మొదట్లోనే' ఏరా! ఇలా చెడిపోయావు!' అని ప్రత్యక్షంగా అనకూడదు. కాని ఆ అర్థం ఆత్మీయతలో రావాలి. అప్పుడు తప్పు చేసిన వాడు తేలుకుట్టిన దొంగ అవుతాడు. అందుకే నిగమశర్మ అక్క ఇలా ప్రారంభించింది.

**ప్రారంభించిన వేదపాఠములకున్ బ్రత్యూహ మౌనంచునో**

**ఏరా తమ్ముడ! నన్నుజూడజనుదే వెన్నాళ్ళనోయుండి చ**

**క్షూరాజీవ యుగమ్ము వాచె నినుఁ గన్గోకున్కి మీ బావయున్**

**నీరాకల్ మదిగోరు జంద్రు పొడుపున్ నీరాకరంబుంబలెన్.**(తృతీయాశ్వాసం )

ఏరా తమ్ముడూ! ఎందుకురా ! మా ఇంటికి రావడమే మానేశావు. చందమామ కోసం సముద్రం ఎదురు చూస్తున్నట్లు నీకోసం మీ బావా, నేను కళ్ళు కాయలు కాచేటట్టు చాలా రోజుల్నించీ ఎదురు

చూస్తున్నామురా! కొత్తగా వేదపాఠాలేమైనా అధ్యయనము చేయటం ప్రారంభించావా? వాటికి అడ్డు కలుగుతుందనా ఇక్కడికి రావడం లేదు.'' అంటూ ప్రారంభించింది.

కనబడకుండా ఉండే దెబ్బలు అక్క మాటల వెనుక ఉన్నాయి. పైకి ఆత్మీయత.లోపలఎత్తిపొడుపు. నిజానికి వాడు చదవటం లేదని, వేశ్యలతో చెడు తిరుగుళ్లుతిరుగుతున్నాడని అక్కయ్యకి తెలుసు. ''ఏరా ! కొత్త పాఠాలు చదువుకొంటున్నావా ! అంత తీరిక లేకుండా ఉందా!/ మా ఇంటికి రావటం మానేసావ్? '' ఇలా ఆత్మీయంగా పలకరిస్తూ అతడు సిగ్గు పడేట్టు చేసే తెలుగు వారి లోగిళ్లలోని పలకరింపులను శాశ్వతము చేసాడు మహా కవి. ఇటువంటి జీవద్భాష కోసము ప్రబంధాలు చదవాలి.

**అలమి గుడిమింగువానికిదలపులప్ప**

**డములు కాకుండునే? యగస్త్యముని పనుపు**

**మీరి యూరగిగుర్వున మిన్ను ముట్టు**

**నింత మేటికి నా మాట యెంత పాటి.(5-229)**

గృహస్థ జీవితము ఎంత గొప్పదో చెప్పినా అయుతుడు వినలేదు. అప్పుడు ఇంద్రుడు చెప్పిన మాటలివి. గుడి మింగేవానికి తలుపులు అప్పడాలవంటివనే సామెత సందర్భోచితముగా ఇక్కడ వాడబడినది.

**రామకృష్ణుని పద గుంఫనము వక్రోక్తి మూలకమని చెప్పుచూ'- ఒక పదమునందో , విగ్రహవాక్యమునందొయేదో వైచిత్రి లేనిదాయనకు సమాసమే కుదరదన్నారు పుట్టపర్తి వారు(తెలుగు రీతులు- తెనాలి రామకృష్ణుని తెనుగు కవిత .పు.41)**

**కురులు నల్లగా ఉన్నాయని చెప్పటానికి''**

**''మొలకచీకట్లు జలజల రాల్పగ రాదె**

**నెరులు మించిన వీరి కురులయందు ''** అంటాడు. (**1-117**) **చీకట్లు జలజలా రాల్చుట అనేది ఒక కొత్త** భావన. **ఉహ్వాని హోమాగ్ని యూదనొల్లడు గాని/ విరహ జ్వరార్తితో వెచ్చనూర్చు**(**3-12**) అను **వర్ణనలో ఉహ్వాని** ఒక చక్కటి వెక్కిరింత. పుండరీకునికి ప్రత్యక్షమైన కృష్ణుని దేవకీ తర్ణకము (దేవకి దూడ-**2-31**)అంటాడు హాస్య ప్రియుడు రామకృష్ణుడు.

**"ఇంతమంది కవులలో, కొందరు గొప్ప కవులగుటకు హేతువేమనగా వారి పాండిత్యము కాదు. పాండిత్యమును వినియోగ పరచిన పద్ధతి. ఆ మాటల కూర్పు. ఆ వాక్యమును కూర్చెడి లక్షణము. ఒక మద్దెల వాయించినట్లు, ఒక నాట్యము చేసినట్లు, ఒక సంగీతము పాడినట్లు, ఒక వేషమును ధరించినట్లు అని**

అంటారు. సరస్వతీ దేవి పలుమందిని పలు విధాలుగా కరుణిస్తుందని ఆ విధంగా కరుణింపబడిన కవి రామకృష్ణయ్య (విశ్వనాథ వారి పీఠిక).ఈమాటను కాదనే సాహసము ఎవరికీ ఉండదు.

**విజయవిలాసము**

మానసికపరమైన ఉల్లాసానికి- ఆనందానికి బాధలోనూ, ఒత్తిడి లోనూ, ప్రశాంతంగా, ఆనందంగా ఉండటానికి చమత్కారం ఎంతో ఉపయోగపడుతుంది. చేమకూర వేంకట కవి రచించిన విజయవిలాస కావ్యములో ఉన్న దాదాపు 600 పద్యాలలో చాలా భాగం చమత్కారాలతో ఉన్నవే. అందుకోసమే తెలుగు భాషపై ప్రేమ ఉన్న ఆధునికులు చమత్కారాలు చదివి ఆనందించటానికివిజయవిలాస ప్రబంధాన్ని చదవాలి.

విజయవిలాస కావ్యంలో మూడు అశ్వాసాలున్నాయి.మొదటి ఆశ్వాసములో 228, రెండవదాంట్లో 206, మూడవదానిలో 238 పద్యాలున్నాయి.మొత్తము 672పద్యాలు. మహాభారతం – ఆదిపర్వంలో ఉన్న సుభద్రా వివాహ కథలో కొన్ని చక్కని మార్పులు చేసి, చమత్కారాల్తో తన నేర్పును "విజయవిలాస కావ్యంలో ప్రకటించాడు చేమకూర వేంకటకవి. కొన్ని చమత్కారాలను పరిశీలిద్దాం.

గంగమ్మని ఇలా ప్రార్థించాడు కవి.

పెల్లుసెగజల్లు విస మా

తెల్లనిదొర కుతికమోవదిని బ్రతుకుట నీ

చల్లదనంబునగాదే

కల్లోలవతీమతల్లి గంగమ తల్లీ

ఈశ్వరుడు తెల్లనివాడు. లోకాల మేలు కోసము విషాన్ని సేవించి దాన్ని గొంతులోనే ఆపేసాడు. ఇక్కడి వరకు మాములు విషయమే. శివుని నెత్తిమీద గంగాదేవి ఉండడం వల్ల విషమనే అగ్ని కంఠంలో ఉన్నా అతడు చల్లగా ఉన్నాడని కవి చమత్కారము.

ఆపుర మేలు ' మేలు, బళి ' యంచుబ్రజల్ జయవెట్టుచుండ, నా

జ్ఞాపరిపాలనవ్రతుడు, శాంతిదయాభరణుండు సత్యభా

షాపరతత్త్వకోవిదుడు, సాధుజనాదరణుండు దానవి

ద్యా పరతంత్ర మానసుడు ధర్మతనూజుడుదగ్రతేజుడై.

ఈ పద్యంలో చేమకూర చూపిన చమత్కారము "ఆజ్ఞాపరిపాలనా వ్రతుడు" అని చెప్పడంలో .తాము చెప్పినట్టు ప్రజలు నడుచుకోవాలని, తాము మాత్రము నడవమనే మాములు రాజుల పద్ధతిలో కాకుండా, తను చేసే ఆజ్ఞలను తాను కూడా పాటించే వాడని ధర్మరాజుకు గొప్ప విశేషణము వేసాడు. ప్రభుత్వము వారిచ్చిన

వాహనాది సౌకర్యములను కర్తవ్య నిర్వహణలోనే కాకుండావిడిగా వ్యక్తిగత పనులకోసము వాడుకొనే నేటి అధికారులనే రాజులకు కూడా ఈ ప్రబంధములోని సందేశము పాటించవలసిన అవసరము ఉంది.

అతని నుతింప శక్యమె? జయంతుని తమ్ముడు సోయగంబునన్

బతగకులాధిపధ్వజుని ప్రాణసఖుండు కృపారసంబునన్,

క్షితిధరకన్యకాధిపతికిన్ బ్రతిజోదు సమిజ్జయంబునం,

దతని కతండె సాటి చతురబ్ధిపరీతమహీతలంబునన్.

ఈ పద్యంలో కవి అర్జునుడిని ఈ భూలోకముతో సంబంధములేని జయంతునితో, విష్ణువుతో, శివునితో పోల్చాడు. స్వర్గంలోనివాడు జయంతుడు వైకుంఠంలోనివాడు విష్ణువు(కృష్ణుడు), కైలాసంలోనివాడు ఈశ్వరుడు.ఇతరలోకాలలో అతనికి సమానమైన వారు ఉన్నారు కాని, నాలుగు సముద్రాలతో ఉన్న భూమిలో అర్జునునికి సమానమైన వాడని చెప్పదగినవాడు లేడని కవి చమత్కారము.

అపుడు నృపుడు ప్రఫుల్ల నవాంబుజ ప్ర

సన్న ముఖుడయి మలయ ధ్వజ క్షితీశ

కమల హితునకు మామ కాగమన వార్త

దెలుపు మనుచు విశారదు బిలిచి పనిచె.

అర్జునునికి సంబంధించిన ఈ మామ పద్యము చాలా ప్రసిద్ధమైనది.

విశారదుడనే స్నేహితునితో అర్జునుడు ఇలా చెబుతున్నాడు. నువ్వు మలయధ్వజుని దగ్గరకు పోయి "మామకాగమన వార్త" - నేను వచ్చానన్న వార్త చెప్పు." అన్నాడు.పైకి కనిపించే అర్థము ఇది. ఇందులోని చమత్కారాలను విజయ విలాస వ్యాఖ్యాతలు ఇలా పేర్కొన్నారు.

1) ."మామకు ఆగమన వార్త అని కూడా చమత్కారము విచారించాలి. (జూలూరి వారు )

2) "మామకున్ ఆగమన వార్త ... తన కూతురును నాకిచ్చి పెళ్లి చేయమని ఆయనను అడుగు అని చమత్కారము" (వేదము వారు.)

3) "మామ+కాగ+మన వార్త తెలుపుము" అంటే మామ అయేటట్టు మన వార్త చెప్పు . ఓ విశారదా ! నువ్వు చెప్పినది విని మలయ ధ్వజుడు మా వివాహానికి ఒప్పుకోవాలని చేయవలసిన పనంతా విశారదుడి మీద పెట్టాడు! (తాపీధర్మారావుగారు)

ఇలా తెలుగు పదాలలోని శక్తి తెలుసుకొని, ఆనందించాలి అనుకొంటే ప్రబంధాలు చదువుకోవాలి.

సాధారణముగా సంస్కృత నాటకాలలో విదూషకులు, మూర్ఖులుగా, తిండిపోతులుగా ఉండుట కద్దు. కాని విజయ విలాస కావ్యములో విశారదుడు సకలధర్మ విశారదునిగా కవి చిత్రీకరించినాడు. అది ఈ ప్రబంధములోని ప్రత్యేకత.

చిత్రాంగదను ఒక చోట వర్ణించే సందర్భంలో చేమకూర కవి "సిగ్గుకు సిగ్గు లేదు"(2-30)అంటాడు. ఇది యొక ప్రత్యేకమైన అభివ్యక్తి.

అచ్చంగా మన తెలుగు వారి ఇండ్లలో మాటలాడుకొనే పద్ధతి చేమకూర పద్యాలలో ఉంటుంది.

ఒక తెలుగు అమ్మాయి తనకు తెలిసిన వారి క్షేమసమాచారాలను అడుగుతోంది. (సుభద్ర అర్జునునితో)

అవుగా మీ రిట మున్ను గన్గొనినచాయ ల్లేవుగా నాఁట నుం

డి విశేషంబులు గొన్ని మిమ్ము నడుగన్ వేడ్కయ్యెడు న్నాకు నె

య్యవి గన్గొంటిరి పుణ్యభూము? లట రాజ్యంబుల్ మనోజ్ఞంబు లె

య్యవి? యేయేపురముల్ గనంబడియె మీ కందంద మార్గంబునన్?162

మీ రింద్రప్రస్థముఁ గని

నారా? పాండవులఁ జూచినారా? సుఖులై

**వారందఱు నొకచో ను**

**న్నారా? వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా? 163**

పై రెండు పద్యాలలో చక్కటి వ్యావహారిక శైలి ఉంది.

శ్రీకృష్ణుడు మాయా యతి వేషంలో ఉన్న అర్జునుని సుభద్రకు పరిచయము చేస్తున్న సందర్భములో పద్యమిది.

**కామాది స్ఫురణమ్ములెల్ల నడగంగా జేసి ధన్యాత్ములౌ**

**స్వాముల్ వీరలు; వీరికింపొదవు లేవన్ సేవ గావింపు ; మెం**

**తోమోదంబుననానతిచ్చి బలభద్రుండే నియోగించినా**

**డేమో చెప్పితినంచు నుండెదవు సుమ్మీ నీ మదిన్ సోదరీ!(2-122)**

“చెల్లీ! సుభద్రా! వీరు కామక్రోధాదులను అణచిన వారు. (మన్మథుడు మొదలైన వారిని మించిన వారు). అమ్మా! తల్లీ ! నేను చెప్పానని చెప్పి , ఆమాటకే కట్టుబడిపోయి అలా ఉండిపోతావేమో !(ఈయన యోగి అనే మాటకి) పరిస్థితినిబట్టి వెనుకా ముందు ఆలోచించుకో”

తెలుగు వారి లోగిళ్లలో ‘‘ఇదుగో ! నేను చెప్పానని చెప్పి అలా ఉండిపోకు. కొంచెం పరిస్థితినిబట్టి ఆలోచించుకో!’’అని వినబడేమాటలను విజయవిలాస కర్త తన పద్యంలో పొందుపరిచాడు. ఈ ఆత్మీయతను తెలుగు వారు వదులుకోకూడదంటే విజయ విలాసాన్ని చదవాలి.

‘‘ఆనతి ఇచ్చెనా యది శిలాక్షరము’’ ఊదుకపోవు శంఖమునహో గళరేఖ’’ మొల్లమొగ్గల దొరగా బల్కుదురు పల్కుదురు జవ్వనికిన్ ‘‘ ‘‘మన సుభద్ర సుకృత మహిమ యేమనవచ్చు/మనసు భద్రమయ్యె మనకునెల్ల ‘‘ మొదలైన పద్యాలలో చేమకూర పదాలు విరిచిన, పదాలు మెరిపించిన ప్రతిభకు శిరస్సు వంచుతాము.

తెలుగు వారి అక్షరాలకు సంబంధిమ్చిన దీర్ఘాలు, తలకట్లు ఒక నాయికకు వర్ణిస్తూ చెప్పిన పద్యము చదివితే ఔరా! చేమకూర’’అనుకోకుండా ఉండలేము.

కన్నులు దీర్ఘముల్, నగుమొగంబవురా! తలకట్టు తమ్మి పూ

పున్నమ చందమామలకు; బొక్కిలి చక్కదనంబుజెప్పగా

నున్నదె? మేలు బంతులు పయోధరముల్; మఱి కౌనుసున్నయౌ

నెన్నిక కెక్కు వ్రాతఫల మివ్వరవర్ణినికి న్నిజంబుగన్’’

కొందరి వ్రాత ఫలం గొప్పగా పెట్టి పుట్టినట్టు ఉంటుందిట. వ్రాతఫలం అంటే బ్రహ్మగారి రాత వలన కలిగిన అదృష్టం.

అఆఇఈ మొదలైన అక్షరమాల వర్ణమాల . వరవర్ణసంపద కలిగిన భాష వంటి సుభద్ర వర్ణన ఇది. ఆమె!

ఆమె కన్నులు దీర్ఘాలు. ఆమె ముఖం తలకట్టు (గుడి) .నడుము సున్నా(ఉన్నదాలేదా అని భావము).నా అక్షరాలు వెన్నెల్లో ఆడుకొనే అందమైన ఆడపిల్లలు అనే ఆధునికకవికి ఈ ప్రబంధాక్షర సౌందర్యము ప్రేరకమే.

ఒక్కొక్కసారి ఎంత బాగా రాసినా సమకాలీన సమాజం గుర్తించదు. ఇలా బాధపడిన కవులలో చేమకూర వెంకట కవి ఒకరు. "ఏ గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే అన్నాడు. ఒక అందమైన వాక్యాన్ని గుర్తించి ఆనందిస్తే – అలాంటి మరోపంక్తిని వ్రాయాలనే ఆర్తి ఉంటుంది. నా సాహిత్యాన్ని గుర్తించేవాడు ఎప్పుడో పుడతాడని ఎదురుచూసే భవభూతులను మనము తయారు చేయకూడదు. ప్రతిభ ఉన్నవాడిని మెచ్చుకోవాలి.

"మీరొక కందపద్యం వ్రాసి బజార్లో పడవేస్తే, తీసి చూచి చదివినవారు అది మీదే అని మీకంద చేస్తారు. 'కంద' రచనలో విలక్షణ శైలిమీది. మీరు కంద కవి సార్వభౌములు" అని కీర్తిశేషులు ఉత్పల

సత్యనారాయణాచార్యులు గారు ప్రసాద్ అని ఒక వర్ధమాన కవిని ప్రశంసించారు.ఇటువంటి ప్రశంసలు ప్రతిభ కలకవులను చేమకూరలా బాధ పడకుండా చేస్తాయి.

కృష్ణ కృష్ణాయటంచు నా కీరవాణి

రామా రామ యటంచు నారాజసుతుడు (3-25)అని నాయికా నాయకులు స్మరణచేసారని కవి వాణి. ప్రబంధము చదివిన తరువాత వెంకటవెంకట అని పాఠకులు స్మరిస్తారు.

వీటి రహి మెచ్చవలయుబో వేయినోళ్ల''అని చేమకూర పద్యంలోని పంక్తిని ఆయన కవిత్వానికి అన్వయిద్దాము.

## వైజయంతీ విలాసము

గోల్కొండసామ్రాజ్యాన్ని పాలించిన కులీ కుతుబ్ షాహీ కాలం వాడు  సారంగు తమ్మయ్య. అతను రచించిన ప్రబంధము వైజయంతీ విలాసం .హరి తన కంఠంలో ధరించే వైజయంతి అను పేరుతో ఉన్న దండ  యొక్క అంశతో జన్మించిన వాని కథ  వైజయంతీ విలాసం .

ఈ ప్రబంధములో  అద్భుతమైన వర్ణనలు ఎన్నో ఉన్నాయి. కథలో వేశ్యాలంపటము వల్ల కలిగే నష్టాలు ఏనాటి సమాజానికయినా పనికి వచ్చేటట్లు తెలియచేయబడ్డాయి.

శ్రీరంగంలో ఊరికి వెలుపల తోటలో ఉండి శ్రీరంగనికి రోజూ పూల మాల సమర్పించుకొనేవాడు విప్రనారాయణ. ఒక సారి దేవదేవి అనే అందమైన వేశ్య నమస్కరించటానికి వస్తే , విప్రనారాయణ పట్టించుకోడు.అతనిని దొంగ సాధువని నిరూపించి తీరుతానని అక్క మధురవాణితో పందెం వేసి , దిక్కులేని దానినని చెప్పి విప్రనారాయణ దగ్గరికి వస్తుంది. ఆశ్రయము కోరుతుంది.

అప్పుడు విప్రనారాయణుడు చెప్పిన ఈ పద్యము చిరస్మరణీయమైనది.

**కాకులు రావిపండ్లు దిని క్రక్క శిలామయ దేవమందిరా**

**నీ కములందు రావులు జనించును, సజ్జన చిత్తవృత్తియ**

**వ్యాకుల లీల రాతి గుడి వంటిది లోకములోన వేశ్యలు**

**న్గాకుల వంటి వార లటు గాన బ్రమాదము జేరనిచ్చినన్**

గుడికి ప్రహారీగోడ ప్రక్క రావి చెట్టు మీద వాలిన కాకులు రావిపళ్ళను గోడమీద పెట్టుకుని తింటాయి. అలా తినే సమయములో కొన్ని గింజలు గోడమీదపడిపోతాయి.. ఆ విత్తనాలు ఆ ప్రహారిగోడ సన్నని పగుళ్లలో చేరతాయి.తరువాత కురిసే వర్షానికి ఆ గింజలు మొలకెత్తి మొక్కలుగా పెరిగి అంత పెద్ద ప్రహారీగోడని పగలకొడతాయి..

మంచివారి మనస్సు ప్రహరీగోడ వంటిది. వేశ్యలు కాకుల వంటివారు.. వీళ్ళు మాటలు, చూపులు మొదలైన గింజలను మంచివాళ్ల మనస్సులో నాటుతారు. క్రమక్రమంగా మనస్సులో మొక్కలై , వృక్షాలై జీవితాలనుచీల్చేస్తాయి. ముందు జాగ్రత్తగా మంచివారు వేశ్యలకి దూరముగా ఉండాలని విప్రనారాయణుడు దేవదేవికి చెబుతాడు.

ఇన్ని చెప్పిన పెద్దమనిషి దేవదేవి మోహములో పడతాడు. .

తదుపరి దేవదేవి సాంగత్యముతో విప్రనారాయణ ఎలా నాశనమయ్యాడో ఒక అందమైన పద్యములో రచయిత చెబుతాడు.

**ఆవిప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స**
**ద్భావం బంగన సాహచర్య గుణ సంపర్కంబునన్ లోహమై**
**గ్రావంబై, ధృఢ దారువై, తరుణ వృక్షంబై, ఫలప్రాయమై**
**పూవై తన్మకరందమై కరగెబోబోన్నీళ్ళకుం బలచనై. ఆ 2, పద్య 139**

దేవదేవితో పరిచయం కాకముందు విప్రనారాయణుని అంతరంగము వజ్ర పంజరం లా చాలా కఠినమైనది.దేవదేవి సాన్నిహిత్యముతో ఆయన మనస్సు వజ్ర స్వభావాన్ని కోల్పోవడం మొదలుపెట్టింది.

వజ్రములాంటి ఆయన సద్భావము తక్కువ కాఠిన్యము ఉన్నలోహంగా మారింది. క్రమక్రమంగా బండరాయిగా ,గట్టి దుంగలా, లేత కొమ్మలా, కొమ్మ పండులా, పండు పువ్వు లా, పువ్వు లోని తేనెలా, నీరులా పలుచనయింది.ఒక వ్యక్తి పతనావస్థను అత్యద్భుతముగా చిత్రీకరించినఈ పద్యము 565 గద్య పద్యాలున్న ఈ కావ్యములో మకుటాయమైనది.

కవిత్రయములోని ఎర్రాప్రెగడ చిన మనుమడయిన చదలవాడ మల్లన కవి విప్రనారాయణ చరిత్రను, తిమ్మభూపాలుడు పరమయోగి విలాసమును దాదాపుగా ఇదే ఇతివృత్తముతో రచించారు.

## అనిరుద్ధ చరిత్రము

ద్వారకానగరములో ఉన్న అనిరుద్ధుడు యువరాణి ఉషాసుందరి కలలోకి వచ్చాడు. చెలికత్తె చిత్రరేఖ వద్ద ఉషాసుందరి అనిరుద్ధుని గురించి చెప్పింది.తన యోగవిద్యతో చిత్రరేఖ ద్వారకలో ఉన్న నాయకుని ఉష శయ్యాగృహానికి చేర్చింది. వాళ్లకు పెళ్లయింది. ఇది అబ్బయామాత్యుని 'అనిరుద్ధ చరిత్రము' ఇతివృత్తం.

కలకు సంబంధించిన ఈ ఇతి వృత్తంలో వాస్తవికత తగ్గిపోయిందని ప్రశ్నించే ఆధునికులకు జవాబు ఇది.

వ్యావహారిక శైలి అనిరుద్ధ చరిత్రములో కూడా కనిపిస్తుంది.

క్షేమంబిక్కడమీ పరి

నామము వ్రాయంగవలయు నా పౌత్రునిపు

త్రీమణినిరుక్మనయనా

కోమలిననిరుద్ధునకును గూర్పగవలయున్’’(1-96)

నిన్నమొన్నటిదాకా ఉత్తరాలు వ్రాసుకొనే పద్ధతి ఈ జాతిలో ఇలాగే మొదలయ్యేది. దీనిని గ్రంథస్థము చేసిన కవి జాతికి ఆత్మీయుడయ్యాడు.

కృతులు నిజాంకితంబులొనరించిననిష్ట ధనంబులిచ్చి స

మ్మతిబ్రభువుల్ కవీశ్వరుల మన్ననసేయుట కీర్తిగోరి ని

శ్చితమతి దేవతాస్తుతియె సేయు కవీంద్రులనదరించి స

త్కృతియొనరించు సత్ప్రభుని కీర్తికి కీర్తిఘటింపకుండునే?

దేవునిపేరిట వ్రాసిన కావ్యాలను ఆదరించి కవులను రాజులు సత్కరించాలి. కవుల కావ్యాలను అంకితము తీసుకొంటే ఎటువంటి కీర్తి వస్తుందో, అటువంటి కీర్తే దేవునిపేరిట వ్రాసిన కావ్యాలను ఆదరిస్తే వస్తుందని అబ్బయామాత్యుడు రాజులకు హితోపదేశము చేసాడు.

ఈ కవి రచించిన అనిరుద్ధ చరిత్రములో మొత్తము 620పద్య వచనాలు ఉన్నాయి.(సాహిత్య అకాడమీ ప్రచురణ)

సముదీర్ణ చంద్రహాస కళా వినోదముల్,
ముఖములందును రణోన్ముఖములందు
ధర్మగుణాను సంధానతా చతురతల్,
శయములందును హృదాశయములందు(1-64)

ద్వారకా నగరములో ఉన్న క్షత్రియులకు చంద్రహాస కళా వినోదములు అంటే వెన్నెలలు కాయుట ముఖాలలో ఉంటాయి. యుద్ధంలో ఉంటాయి. యుద్ధంలో కత్తిని (చంద్రహాసము)చేపడతారని అర్థము. ధర్మగుణానుసంధానతా చతురతలు –అంటే- విల్లును సంధించే నేర్పులు చేతులందుంటాయి. ధర్మగుణాను సంధానతా చతురతలు- అంటే ధర్మపరులై ఉండే నేర్పులు- హృదయాలను ఆశ్రయించి ఉంటాయి.ఇది పద గతమైన చమత్కారము.

ఆధునికకాలానికి సంబంధించిన ఒక నానుడిని అబ్బయామాత్యుడు ప్రయోగించాడని పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు అభిప్రాయపడ్డారు.ఒక చెలికత్తె అద్దమున నిల్చిన యనిరుద్ధుని సుందర రూపమును

చూచి భ్రమనొంది సురటి వీచినదట.చెలులు గొల్లున నవ్విరి. లోకమున గొల్లున యేడ్చుటయను దానికిప్రచారమున్నది కాని, గొల్లున నవ్వుట యనుదానికి లేదు. ఆధునిక కాలమున గొల్లున నవ్వుట యని విద్యార్థులు తరచుగాననుట గలదు.(**పీఠిక48 పే.**) కవుల క్రాంతదర్శనానికి ఇది నిదర్శనము.

ఈనాడు యువకులకు ఎక్కువగా వచ్చేది శృంగారానికి సంబంధించిన కలలేనట. ఈ విషయాన్ని మానసిక శాస్త్రవేత్తలు ఇప్పుడు తేల్చి చెబుతున్నారు.అమెరికా శాస్త్రవేత్తలు ఇటీవల 570 మందిని పరిశోధించారు.వీరిలో అధికశాతం మంది శృంగార పరమైన కలలు, ఎగిరిపోతున్నట్లు వచ్చే కలలను మాత్రమే వారి జీవితంలో చోటు చేసుకున్నట్లు తెలిపారు. (**జులై 11, 2014 సాక్షి దినపత్రిక**)కనుక నేటికీ అనుభవములో రాణిస్తున్న ఈ కలను ప్రబంధ కళగా మార్చిన అబ్బయామాత్యుడు స్తవనీయుడు.

**రామాభ్యుదయము**

16 వ శతాబ్దానికి చెందిన అయ్యలరాజు రామభద్రుడు రచన ఇది.రామాభ్యుదయాన్ని శ్రీకృష్ణదేవరాయలు అల్లుడైన అళియ రామరాయలు యొక్క మేనల్లుడైన గొబ్బూరి నరసరాజుకు అంకితమిచ్చాడు.

మూల రామాయణానికి కొద్ది మార్పులతో ఎనిమిది ఆశ్వాసాల రామాభ్యుదయము అను ప్రబంధమును కవి రచించాడు. ఇందులో కొన్ని చమత్కారాలు పరిశీలిద్దాం.

సీతభూమికి పుట్టినది. .కావున వ్యవసాయ నేపథ్యములో ,సీతా రాముల దాంపత్యాన్ని కవి ఇలా చమత్కరించాడు.

"పంట వలంతికి బోడమి భాసిలు సీతవు గానజేలతో

నంటిన ఘర్మ వారిబద నై ,పులకోదయ సస్య సంపదన్

గెంటక యున్కి నీక తగు,నేడిట నా వ్యవసాయ మేర్పడన్

కంటి నిరంతరానుభవ గౌరవ సౌఖ్యముబండెగోరికల్ (04-176)

సీతా దేవి పంటవలంతి కుమార్తె. అందువలన పులకింతలనే పంటల సంపద ఏర్పడిందని కవి రాముని ద్వారా చమత్కరించాడు.సందర్భ స్వభావానుకూలంగా ప్రదర్శించే ఉత్కృష్ట నిర్మాణ చాతురీ విశేషమే శిల్పం అనుకొంటే ఇది కూడా శిల్పమే.

హరిమధ్య యనుట వరమం

ధరగామినులందు వర్ణనా మాత్రమగున్

బరమార్థము కౌసల్యాం
బురుహాక్షికి విష్ణు గర్భమునబూనుటచేన్(03-86)

ప్రాచీన కవులు స్త్రీ నడుము సింహపు నడుములా సన్నగా ఉంటుందని చెబుతుంటారు. హరి అంటే సింహమని, విష్ణువని రెండు అర్థాలున్నాయి దీనిని కవి ఇక్కడ చమత్కరిస్తున్నాడు.ఇతర స్త్రీల విషయములో హరి మధ్య అనుట కేవలము వర్ణనకే. హరిని గర్భమందు ధరించిన కౌసల్య నిజంగా హరి మధ్య .

రాముడు అడవులకు వెళుతున్న సందర్భములో దశరథుని విలాపమిది.

కానక కన్న సంతానంబుగావున
గానక కన్నసంతానమయ్యె
నరయ గోత్రనిధానమై తోచు గావున
నరయ గోత్ర నిధానమయ్యె నేడు(5-12)

చాలారోజులకి కన్న సంతానము కావున- ఈ రోజు కనబడకుండా పోతోంది. గోత్ర నిధానమై(=వంశానికి నిక్షేపమై) రాముడు ఉంటాడు అని భావించాను. అందుకే అతడు గోత్ర నిధానమయ్యాడు(=అడవులకి, కొండలకి నిధి అయ్యాడు)

ఏడుపులో చమత్కారముంటుందాఅని ప్రశ్నిస్తే మన ప్రబంధ కవుల దృష్టి అది. సర్వము వారి దృష్టిలో సౌందర్యమయము.అర్థము చేసుకోవటం కొంత కష్టము కాని, సౌందర్యము కానిదేది ఈ ప్రపంచములో లేదు.

విభీషణుడు రావణునికి హితోపదేశము చేస్తున్న సమయంలో అయ్యలరాజు ఈ కమ్మని పద్యము రచించాడు.

**పరుషోక్తి బాధ చూడకు**
**పరిణామ సుఖముచూడు, బ్రతికెద వసుధే**
**శ్వర! మందు చేదుచూడకు**
**పెరిగినతెవులడగ జూడు పెద్దతనానన్!(7-75)**

సీతమ్మను రామునకివ్వమని నేను పరుషోక్తులు అంటున్నానని బాధ పడకు. దీనివల్ల రాబోయే సుఖాన్ని గమనించు. ఓ రాజా! మందు చేదు చూడకూడదు. రోగము పోయిన తర్వాత వచ్చే హాయిని పెద్దమనస్సుతో ఆలోచించాలి.

సుగ్రీవుని పట్టాభిషేక సమయంలో వచ్చిన బ్రహ్మాండమైన వర్షవర్ణన ఇదిః

**ధారా శుద్ధి బ్రసిద్ధి గాంచి, ఘన శబ్ద స్ఫూర్తి వర్తిల్లగా**

**దోరంబైన రస స్థితిన్ దరళ విద్యున్మాలికా లక్షణో**

**దారంబై కవి సేవ్యమై వన మయూరారూఢి బ్రాపించి, వ**

**ర్షారంభంబు ప్రబంధమ ట్లఖిల పద్యాక్రాంత మయ్యెన్ దగన్.(6-13)**

వర్షాన్ని, ప్రబంధాన్ని ఒకేసారి వర్ణించిన మంచి పద్యమిది.

వర్ష ప్రారంభము శుద్ధమైన వర్షధారవలన ప్రసిద్ధి పొందింది. ,గొప్ప ఉరుములతో వర్ధిల్లింది.నిరంతరంగా కురిసే నీటితో, మెరుపుల సమూహంతో ,పక్షులు సేవించుకొనేపద్ధతిలో , నెమళ్లు పొడవగునట్లుగా , గొప్ప బంధములా ,అన్ని ప్రదేశాలను తగిన విధముగా వర్ష ప్రారంభము ఆక్రమించుకొన్నది.

పద్యవర్ష ప్రారంభము ప్రబంధములా శుద్ధమైన కవితా ధారతో ప్రసిద్ధి పొందింది. గొప్ప శబ్దములతో వర్ధిల్లింది.దట్టమైన రసస్ఫూర్తితో, ప్రకాశించే విద్యున్మాల, వన మయూరము మొదలైన లక్షణాలతో, కవులు సేవించుకొనే విధంగా, అన్ని రకాల పద్యాలకు స్థానమయింది.ఈ పద్యములో కవి కావ్యశరీరము, ఆత్మను

పేర్కొని మనోజ్ఞమగు శబ్దశక్తి మూలధ్వనిని సాధించాడని ఆచార్య కాకర్లవారు ప్రశంసించారు.(రామాభ్యుదయము. సాహిత్య అకాడమీ ప్రచురణ.)

మొల్ల రామాయణంలో 'కడవల నుదకంబు ముం చితెచ్చి వంచిన గతి' వాన కురిసినట్లు వర్ణన. 'కవి కర్ణరసాయనం' లో సంకుసాల నృసిం హకవి 'కుంభద్రోణములు వట్టి వానల్ కురిసెన్ ' అనిఉంది. శుక సప్తతి కర్త కదిరీపతి 'అంబుధిఁదల

క్రిందుగ పట్టినట్లు' వర్షం ఉద్ధృతంగా కురిసిం దని చెప్పాడు. అయ్యలరాజు వారు ప్రబంధానికి, వానకు ముడి వేసారు.

ముఖే ముఖే సరస్వతీ!

ఇటువంటి చక్కటి పద్యాలున్న రామాభ్యుదయ ప్రబంధము మనస్సులను కొన్నిచోట్ల కరిగిస్తుంది.అందుకే కవిత్వంలో కరిగిపోవాలనుకొనే ఆధునిక సహృదయులు – మాకెందుకులే అని వదిలేయకుండా -ఈ ప్రబంధము చదవాలి.

రాజశేఖర చరిత్ర

కృష్ణరాయలకు సమకాలికుడు మాదయగారి మల్లన. ఇతడు తన రాజశేఖరచరిత్రను సాళువ తిమ్మరసయ్యగారి యల్లుడగు నాదిండ్ల అప్పయ కంకిత మిచ్చాడు.

చిన్న కథను తీసుకుని 516 గద్యపద్యములతో పెద్ద కావ్యంగా మల్లన దీన్ని మలిచాడు.

చెప్పదగు కవిత రసముల్

జిప్పిల; నప్పప్ప ! భళిభళీయన; లేదా

యెప్పుడు జేయక యుండుట

యొప్పు సుమీ! సుకవి యెంత యుచితజ్ఞుడొకో(1-18)

ఇది కవిత్వముపై మల్లన వ్యాఖ్య.

ఇది ఆధునిక కవిత్వానికి కూడా వర్తిస్తుంది.

ఆ కాలములో దరిద్రము ఎలా ఉందో, కవి అరుణుడు అనే పాత్ర ద్వారా ఇలా చెప్పించాడు.

కులనిర్మూలన కారణంబు, ప్రతిభాకుట్టాకము, ద్వేగకో

పలతాదోహద, మాజవంజవ సుఖ ప్రత్యూహ, మాత్మవ్యథా

జ్వలన జ్వాలిక, కామినీ నయన వీక్షాపాత సంరోధి, ని

**త్యలఘుత్వాశ్రయ భూమి, లేమి యది యాహా! యేమి గావింపదే!(3-14)**

నిత్యము మనిషిని తేలిక చేసే భూమిట లేమి. దరిద్రము ప్రతిభను తుంచేస్తుంది. ఉద్వేగము, కోపము అనే తీగలు విస్తారముగా పెరిగేటట్లు చేస్తుంది. సంసార సుఖానికి విఘ్నము కలిగిస్తుంది.ఆత్మవ్యథ అనే మంటలతో మండిస్తుంటుంది.

ఇన్ని చెబుతూ చిట్ట చివర **'ఏమి గావింపదే'** అన్నాడు. అందులోనే పద్యముయొక్క అసలు కీలకముంది.

హేమ ధన్వుడనే రాజు తన భార్య పాలికతో శివ భక్తి గొప్పతనాన్ని చెప్పే ఈ పద్యము కొంచెం సాహిత్యము చదువుకొన్నవాళ్లకందరికి పరిచితమైనదే.

**నీలకంఠుని శిరసుపై నీళ్లు చల్లి**

**పత్తిరిసుమంత నెవ్వాడు పారవైచు**

**కామధేనువు వానింటి గాడి పసర**

**మల్ల సురశాఖి వానింటి మల్లె చెట్టు (1-65)**

నిర్లక్ష్యంగా అయినా సరే –శివుని శిరస్సుపై ఎవడు కాసిని నీళ్లు చల్లి, ఒక్క మారేడుదళం ఆయన మీద పారేసినా, శివుడు ఆనందించి అనుగ్రహిస్తాడు. కామధేనువు అలా చేసిన వాడింటి పశువుల కొట్టంలో

ఆవుగా మారి కోరిన కోరికలు తీరుస్తుంది. కల్పవృక్షం ఆ భక్తుని పెరట్లో మల్లెచెట్టు లా మారుతుంది. శివుని దయ అంత గొప్పదో మల్లన అంత గొప్పగా చెప్పాడు.

తెనాలి రామ కృష్ణుడు – ముక్కెర పోతే నిగమశర్మ అక్క ఏడ్చినదని వ్రాసాడు. ఇది పరిహాసానికి అలా రామకృష్ణుడు వ్రాసాడని అందరము అనుకొంటాము. కాని ఆ కాలంలో ముక్కెరకు ఎంతో ప్రాముఖ్యమున్నదని మల్లన వ్రాసిన ఈ పంక్తుల ద్వారా తెలుస్తుంది.

ఇంద్రాణికైన, కంసరిపురాణికైన, గణింపరానికట్టాణి మెరుంగు ముత్తియమనర్ఘ్యము ముంగరకిచ్చె దల్లి''(3-183)

ఇంద్రుని భార్య శచీదేవికైనా, కృష్ణుని భార్య రుక్మిణి యైనా, లెక్కపెట్టడానికి వీలులేని సొగసైన, శ్రేష్ఠమైన ముత్యాన్ని ముక్కెరకు పెట్టిందట నాయిక తల్లి. ముక్కెరకు అంత విలువుంది. ఇంత ప్రాముఖ్యము ఉన్నది కనుకనే నిగమ శర్మ అక్క వలవలా ఏడ్చింది.

ఇలా ఒక కవి పద్య రహస్యము, ఇంకొక కవి పద్యములో దొరకటం ప్రబంధాల ప్రత్యేకత.

రాజశేఖరుడనే నాయకుడిని నాయిక చూస్తోంది.అప్పుడు మల్లన చూపుల ద్వారా వాళ్లిద్దరి పెళ్లి చేసాడు.

**చిలుక పురోహితుండగుచు జెంగటనుండగ, సిగ్గుపెందెరల్**

**దొలగగద్రోచి, బంధుగతి దోరపు గోర్కులు సందడింపగా**

**దలపు లతాంగి జన్నమును తాన కనుంగవ దోయిలించి చూ**

**పుల దలబ్రాలు పోసె నృపపుత్త్రునిపై విరహాగ్ని సాక్షిగన్(3-133)**

నాయిక పెంపుడు చిలుక పురోహితుడయ్యాడు. హృదయములో ఉన్న సిగ్గు అనే తెరలను నాయిక తొలగించింది. ( పెళ్లిలో తెర తీస్తారు కదా!). ఎక్కువయిన కోరికలు బంధువుల్లా సందడి చేసాయి. రెండు కన్నులూ దోసిళ్లయ్యాయి. చూపులనే తలంబ్రాలు ఆ నాయకునిపై పోసింది. విరహమనే అగ్నిసాక్షిగా నాయకునితో, నాయిక వివాహం జరిగింది!

ప్రాచీనమయితేనేమి? నవీనమైతేనేమి? వహ్వా అనిపించేదే కవిత్వము. ఆ వహ్వా దృష్టితో చూసినప్పుడు ఇటువంటి ప్రబంధ పద్యరత్నాలను కాదనుకొంటే నష్టము రత్నాలకు రాదు. రత్నాలను ఉపయోగించుకోనివారికే.

**ముగింపు**

ప్రాచీనకాలంలో అయినా, నవీన కాలంలో అయినా మానవుడు ఒక్కడే.వాడి మనస్సుకు ఆనందము ముఖ్యము. సామాజిక పరిస్థితులవలన ఆనాడు శృంగారము అధికారికంగా ఆదరింపబడింది. ప్రబంధాలు పుట్టుకొచ్చాయి.ఇప్పుడు ఒక విచిత్రమైన కాలంలో మనము ఉన్నాము.బరితెగించిన శృంగారము ఈనాడు మన ఇళ్లలోకి అంతర్జాల(ఇంటర్ నెట్) రూపంలో,కొంచెం ముసుగు వేసుకొని టీవీల రూపంలో, పబ్బుల ప్రదేశాల్లో , సెల్ ఫోన్లలో – అన్ని చోట్లా విశృంఖలంగా ప్రవేశించింది.చలనచిత్రాలలో బూతులు సంభాషణలై ప్రజలని నిత్యము అలరిస్తున్నాయి. పిల్లల్ని అదుపులో పెట్టలేక ఒక రకంగా విచ్చలవిడి శృంగారానికి సమాజము లైసెన్స్ ఇచ్చేసింది.

అభ్యంతరకరమైన సన్ని వేశాలున్న సీరియల్స్న, తల్లిదండ్రులు తమ పిల్లల పక్కనే ఉండి చూస్తున్నారు.సీరియళ్లలోని, సినిమాల్లోని ముద్దులు , కౌగిలింతలు మొదలైన సన్ని వేశాలు అలవాటయిన చాలా మామూలు సన్ని వేశాలయ్యాయి.

కాని, విచిత్రమేమిటంటే ప్రబంధాలలోని సభ్య శృంగారాన్ని తరగతి గదుల్లో చెప్పాలంటే నిరసన వస్తోంది.ఇంట్లో టీవీ తెరిస్తే శృంగారము, చలనచిత్రానికి వెళితే శృంగారము, నాలుగు పాటల్లో మూడు పాటలు శృంగారము.ఆ పాటల సాహిత్యానికి ఈలలతో , చప్పట్లతో తల్లిదండ్రుల ప్రశంసలు. భూమికి

జానెడెత్తు లేని తమ బిడ్డలు వాడు ద్వంద్వార్థాల పాటలతో , వెకిలి నృత్యాలు చేస్తుంటే ఆమోదము. ఆ షోలు చూడటానికి తాపత్రయము. కాని ప్రబంధాల శృంగారమంటే ఏహ్యాభావము.”అబ్బే! ఏంటండి..అలా వ్రాసారు’’అని నలుగురితో పాటు వాటి మీదికి ఒక రాయి.! ఇది చాల చిత్రమైన పరిస్థితి.

నేనేదో ప్రబంధాల శృంగారము సరియైనదని వాదించే వకీలును కాను.మితి మీరిన శృంగార వర్ణనలున్న రాధికా సాంత్వనము లాంటివి కాలగర్భంలో కలిసిపోయాయి. శృంగారానికి అందమైన నగిషీలు చెక్కిన మనుచరిత్ర లాంటివి ఏనాటికి నిలిచే ఉంటాయి. ఇది చారిత్రక సత్యము.

కొన్ని ప్రబంధాలు తప్పించి చాలమటుకు ప్రబంధాలన్నీ శృంగారాన్ని ధర్మపు పునాదులమీద వర్ణించాయి.జాతికి సందేశాన్నిచ్చాయి.మనోహరమైన వర్ణనలతో మనస్సులను ఒక ఊపు ఊపాయి. వాటిలో కొన్నింటిని మాత్రమే- పుటల పరిమితి మేరకు ఈ ప్రసంగ పత్రములో చూపించగలిగాను. ఇంకా ఎన్నో ప్రబంధాలు, మనోహరమైన ధర్మ శృంగారంతో, వర్ణనలతో ఉన్నాయి.వాటిని ఈ జాతికి , భావి భారత పౌరులకు వివరించి ఋషిఋణము తీర్చుకోవలసిన బాధ్యత మనందరి మీద ఉంది.విశ్వనాథ వారు చెప్పిన పద్యముతో ఈ ప్రసంగ పత్రాన్ని ముగిస్తాను.

ఒకడే కార్యము సేయు దివ్యమతి, నేదో మాట వాక్రుచ్చు దా

నొకడా చేసిన చెప్పినట్టి జనుడే యూహం బ్రవర్తిల్లె దా

నికి నిష్కృష్టముగాగ జూడవలెగానీ, నీ యధేచ్ఛానువా

దక సిద్ధాంతములందు జొన్పినయథార్థంబందు గన్పించునే (కల్పవృక్షము అరణ్య. మారీచ.165)

స్వస్తి.

-------------

(ఈ ఆలోచనకు ప్రేరకులయిన ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యగారికి, శ్రీ గిరిజా మనోహర బాబుగారికి, ఈ ప్రసంగ పత్రములో ఉదాహరించిన పుస్తక రచయితలకు, ముఖ చిత్రంగా ఎమెస్కో బొమ్మలు వాడుకొన్నందుకు వారికి, కృతజ్ఞతాంజలి)